5.8.1994 శుక్రవారం, 10 పేజీలు, సంపుటి: 66, సంచిక: 30, విడిప్రతి : రు. 2.00లు

Phone : 27354 Regd. No. HNL. 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



# ఏకాకి అవుతున్న 'ఏకైక' నాయకుడు!

ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కర రెడ్డి ఏకాంత ద్వీపంలో ఒంటి స్తంభపు రాజకీయ మేడ కట్టు కొంటున్నాడు. అందులో చిటారు అంతస్తును తన కొక్కడికే రిజర్వ్ చేసుకుంటున్నాడు. ఆప్త బంధువులు, వందిమాగధులు, చెక్క భజన రాయుళ్లకు తప్ప, మరెవరికీ అందులో ప్రవేశం దొరకదు. హితవరులైతే 'ప్రొహిబిటెడ్'. ఎన్నికలు దగ్గరయ్యే కొద్దీ విజయ భాస్కర రెడ్డిలో ఈ వింత ధోరణి పెరగడం సహజంగానే కాంగ్రెస్ వారిని, మరీ ముఖ్యంగా ప్రజా ప్రతినిధుల్ని కలవర పరుస్తున్నది. మంచి కోరే వారిని, కలిసి పోవాలనుకునే వారిని కూడా దూరం చేసుకుంటే ఇక పార్టీ గతేమి టన్న ప్రశ్న వారిని వేధిస్తున్నది. ఇప్పటికీ కోట్ల వారు తన పాత ఫ్యూడల్ వాసనలను వదలు కోలేక పోవడం వారికి ఆశ్చర్యాన్నే కాదు, ఆందోళనను కూడా కలిగిస్తున్నది.

**క్రమంగా కోట్ల ఒంటరి వాడవుతున్నాడు ఎన్నికలు దగ్గరయ్యే కొద్దీ మిత్రులు కూడా శత్రువులవుతున్నారు. పార్లమెంట్ సభ్యులు తిరుగుబాటు ధ్వజం ఎత్తారు. నాయకత్వం మారాలని ముగ్గురు ఎం.పి.లు పి.వి. వద్దకు రాయబారం కూడా వెళ్లారు. రాష్ట్ర రాజకీయాల్లో ముఖ్యమంత్రి సరికొత్త వైర వర్గాన్ని సృష్టించు కొంటున్నాడు.**

దీనికి ముఖ్యమంత్రి ఉత్తరాంధ్ర పర్యటన ఒక తాజా ఉదాహరణ. ముఖ్యమంత్రి విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల్లో పర్యటించాలని అనుకొన్నది మొదలు అది వివాదాంశమే అయింది. పార్లమెంట్ సభ్యులకు తెలియ జేయకుండా పర్యటన రూపొందిస్తే వివాదం కాక మరే మవుతుంది? పైగా విశాఖ జిల్లాలో పలుకు బడి గల్గిన పార్లమెంట్ సభ్యుడు ద్రోణం రాజు సత్యనారాయణ కోట్లకు కాని వాడేం కాదు. ఆయన డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డికి సన్నిహితుడైనా, కోట్లకు కూడా హితుడుగా ఇద్దరి మధ్య రాయబారాలు నడుపు తున్నవాడు. అంతటి ముఖ్యుణ్ణి ముఖ్య మంత్రి నిర్లక్ష్యం చేశాడంటే ఏమను కోవాలి?

పైగా ద్రోణంరాజుకు తెలియ జేయలేదేమని అడిగితే 'విశాఖ - ఆయన జాగీర్దారేం కాదని' ముఖ్య మంత్రి కొట్టె విరిచినట్టు సమాధానం చెప్పాడు. మిత్రుల్ని కూడా శత్రువుల్ని చేసుకోడానికి ఇంత కంటే గొప్ప వాక చక్యం ఏం కావాలి!

ముఖ్యమంత్రి ఉత్తరాంధ్ర పర్యటన విజయవంత మైందనడంలో సందేహమేం లేదు. ఐతే అది అధికార పర్యటనగా మాత్రమే విజయవంతమైంది. రాజకీయ పర్యటనగా విఫల మైంది. విఫలం కావడం వరకే అయితే ఫర్వాలేదు, విపత్కర పరిణామాలకు కూడా దారి తీసింది. పార్లమెంట్ సభ్యులు ద్రోణంరాజు సత్యనారాయణ, కొణతల రామకృష్ణ, కణితి విశ్వనాథం ముఖ్యమంత్రి సభలను 'బాయ్‌కాట్' చేశారన కూడదు గానీ, పిలవని పేరంటం మా కెందుకు లెమ్మన్నట్టు దూరంగా వుండి పోయారు. ఎప్పుడైతే ద్రోణం రాజు వర్గం ముఖ్యమంత్రికి దూరమైందో, అప్పుడే 'గుడివాడ' వర్గం ముఖ్యమంత్రికి దగ్గరైంది. నిజానికి గుడివాడ గుర్నాధరావు, మంత్రి సాంబశివరాజు, 'ఉడా' అధ్యక్షుడు సూర్రెడ్డికి ముఖ్యమంత్రితో ఏమంత సన్నిహిత సంబంధాలు లేవు. వీరు జనార్ధన రెడ్డి మిత్రులుగా ప్రసిద్ధి. ఐతే ముఖ్యమంత్రి ద్రోణంరాజు మధ్య సంబంధాలు చెడడం కంటే ఈ 'త్రయా' నికి కావల్సిందే ముంటుంది? ఆ అవకాశాన్ని చేజిక్కించుకొని వారు ముఖ్యమంత్రి ఉత్తరాంధ్ర పర్యటనను భుజాల మీద వేసుకొని మోశారు.

ద్రోణంరాజు అంత మాత్రాన్నే చేతులు ముడుచుకొనే రకం కాదు. ముఖ్యమంత్రి పర్యటనను ఎంతగా రచ్చ కెక్కించాలో అంతగానూ ఎక్కించాడు. నేరుగా ఢిల్లీకే ఫిర్యాదులు వెళ్ళాయి. రాష్ట్రానికి చెందిన ఎం.పి.ల సమావేశం జరిగింది. ముఖ్యమంత్రి వైఖరిని వి. హనుమంత రావు, రామకృష్ణ, ద్రోణంరాజు తూర్పార బట్టారు. మల్లు రవి లాంటి ఒకరిద్దరు ముఖ్యమంత్రిని సమర్ధించబోగా చెల్లుబాటు కాలేదు. 'విశాఖ పట్టణ మేరం ద్రోణం రాజు జాగీర్దా కాద'ని ముఖ్యమంత్రి చేసిన పుల్ల విరుపు వ్యాఖ్యకు ద్రోణంరాజు 'టిట్ ఫర్ టాట్' అన్నట్టు "ఈ రాష్ట్రమేం కోట్ల

కొరవ 10వ పేజీలో

## మజ్జిరొట్టివిరిగి....?

పిసిసి అధ్యక్షుడు మజ్జి తులసీ దాస్ రొట్టె విరిగి నేతిలో పడేట్లుంది. మజ్జిని దించి, తనకు అనుకూలుణ్ణి పిసిసి పీఠం పై కూచో పెట్టాలని ముఖ్య మంత్రి కోట్ల చేస్తున్న భగీరథ ప్రయత్నం బెడిసి కొట్టే అవకాశం వుంది. ఇంత కాలం మజ్జిని వెనకేసు కొచ్చిన వారు లేరు; కానీ ఇప్పుడు ముఖ్య మంత్రి మీద తిరుగు బాటు జెండా ఎగ రేస్తున్న ఎం.పిలకు మజ్జి ముద్దొ స్తున్నాడు. పిసిసి అధ్యక్షుణ్ణి ఆరు నెలల క్రితమే మార్చి వుంటే ఫలితం వుండేదేమో కానీ ఎన్నికలు దగ్గర పడడం వల్ల యిప్పుడు మార్పు మంచి జరగదని వాళ్లు కొత్త వాదన లేవ నెత్తుతున్నారు. పిసిసి మార్పు కంటే ఎన్నికల కమిటీని ఏర్పరచడం అవసరమని వారు పి.వి.కి చెప్పు కొన్నారు. ఇదే సమయంలో పిసిసి పునర్ వ్యవస్థీ కరణంటూ ముఖ్య మంత్రి కూడా పివి దర్శనం చేసు కున్నాడు. ఇప్పుడు పి.వి. ఎటు మొగ్గు తాడన్నది వేచి చూడాలి. ఆయన కోట్లను పూర్తిగా కాదన కుండా, ఎం.పి.లను పూర్తి అవున నకుండా మధ్యే మార్గం అనుసరించినా ఆశ్చర్యం లేదు.

# ఇందుకేనా వీళ్ళను ఢిల్లీకి పంపింది!

''ఇండియా దటీజ్ భారత్'' లో ప్రజాస్వామ్యానికి పట్టు కొమ్మలుగా, రాజ్యాంగానికి పుట్టినిళ్లుగా భావించ బడుతున్న చట్ట సభలు జరుగుతున్న తీరు చూస్తుంటే ఈ దేశం ఎప్పు పోతుంది, ఎటు పోతుందనే ఆందోళన కలగడం సహజం. ప్రజలు తనను ఎందుకు ఎన్నుకున్నారో, తాము ఏమి చేయాలని ప్రజలు ఆశిస్తున్నారో మన ప్రజా ప్రతినిధులు విస్మరించినట్లు కనబడుతున్నది. లేకపోతే వారం రోజులుగా పార్లమెంట్ ఉభయ సభల్లో జరుగుతున్న రభస, దీనికి ముందు మన శాసన సభలో జరిగిన గొడవలను ఎట్లా అర్థం చేసుకోవాలి? 'స్కాం' మీద జాయింట్ పార్లమెంటరీ కమిటీ సమర్పించిన నివేదికను కేంద్ర ప్రభుత్వంనిర్లక్ష్యంచేస్తూ, పార్లమెంట్‌ను అవమానిస్తున్నదని ప్రతి పక్షాలు భావించడంలో తప్పులేదు. కానీదాన్నిపార్లమెంట్‌లో వెల్లడించేం దుకు వారు ఎంచుకున్న పద్ధతే ప్రజాస్వామ్యయుతంగా లేదు.

జె.పి.సి. నివేదికపై ప్రభుత్వం తీసుకున్న చర్యలను వివరించే 'అనంతర చర్యా నివేదిక' (యాక్షన్ టేకన్ రిపోర్టు) ను ఉపసంహరించు కోవాలని ప్రతి పక్షాలు కోరుతున్నాయి. ఎందుకు ఉపసంహరించుకోవాలంటే, స్కాం దోషులుగా ఆర్థిక మంత్రి మన్మోహన్ సింగ్‌ను, ఆరోగ్యమంత్రి శంకరానంద్ (అప్పట్లో పెట్రోలియం మంత్రి) ను, గ్రామీణాభివృద్ధి మంత్రి రామేశ్వర్ ఠాకూర్‌ను జె.పి.సి. తప్పు పట్టినా వారిని పదవుల నుంచి తొలగించ లేదు గనుక! ఈ ముగ్గురు మంత్రులు రాజీనామా చేయాలని, చేయకపోతే వారిని తొలగించాలని ప్రతిపక్షాలు చాలాకాలంగా డిమాండ్ చేస్తున్నా, ప్రధాని పి.వి. నరసింహ రావు నిమ్మకు నీరెత్తినట్లు వుంటున్న మాట నిజమే! జె.పి.సి. నివేదిక అందిన వెంటనే ఆర్థిక మంత్రి రాజీనామా చేసినా ప్రధాని దాన్ని ఆమోదించలేదన్న విషయం తెలిసిందే! అందుకు ఆయన చెప్పిన కారణం గమనించదగింది. మొత్తం మీద జవాబు దారీ ఆర్థిక మంత్రిదే అయినా, ప్రతి విషయాన్ని పట్టించుకోవడం, బ్యాంకులు వగైరా ఆర్థికసంస్థల వ్యవహారసరళిని వ్యక్తిగతంగా పరిశీలించడం వీలయ్యేది కాదని ఆయన ఆర్థిక మంత్రిని సమర్థించారు. నిజానికి ఆర్థిక మంత్రి రాజీనామాను ఆమోదించడానికి ఆయన జవాబుదారీ కాలేక పోయాడన్న కారణం ఒక్కటే చాలు. లోగడ టి.టి. కృష్ణమా చారి వంటి ఆర్థిక మంత్రులు రాజీనామా చేసింది కూడా ఇటువంటి కారణాలతోనే నన్న విషయాన్ని గుర్తుంచు కోవాలి. ఐతే అప్పటి విలువలు ఇప్పుడేవి - అంటే అది వేరే విషయం.

> శాసనకర్తలను కొన్న వాళ్లు 'దుశ్శాసన' కర్తలవు తున్నారు. ప్రజల సమస్యలకు, జీవన స్థితిగతులకు, దేశ భవిష్యద్వర్తమ్యాలకు ప్రతిరూపం కావలసిన పార్లమెంట్ సమావేశాలను ప్రతినిధులే పెడదారి పట్టిస్తున్నారు. ప్రజా సమస్యలను చర్చించాల్సిన వేదికను బలాబలాలు తేల్చుకొనే గోదాగా మార్చి భ్రష్టు పట్టిస్తున్నారు.

సరే. మంత్రులను తొలగించడానికి ప్రభుత్వం ఒప్పుకో లేదనుకోండి. దానికి పార్లమెంట్ సమావేశాలను అంగుళమైనా కదల నివ్వకుండా స్తంభింప చేయడం తప్ప మరో మార్గం లేదా ప్రతిపక్షాలకు! పి.వి. ప్రభుత్వం తగినంత మెజారిటీ లేక, ప్రతిపక్షాల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి బతికిన రోజుల్లో అయితే, ఆ ఆట సాగింది. కానీ ఇప్పుడు పి.వి. పరిస్థితి అంత బలహీనంగా ఏమీ లేదు. అజిత్ సింగ్ వర్గం కాంగ్రెస్‌లో చేరిన తర్వాత పి.వి. స్థిరపడగలిగాడు. ఇది సహజంగానే ప్రతిపక్షాలకు కంటగింపు అయింది. దయతలచి తాము మద్దతునిస్తే ప్రభుత్వం బతి33శిబయట పడిన సందర్భాలు వారికి గుర్తున్నాయి. ఇప్పుడు కూడా ప్రభుత్వంఆ బలహీనతలోనే కొనసాగలని, పార్లమెంట్‌లో పదే పదే ప్రభుత్వాన్ని, అవమాన పరచి ప్రజల దృష్టిలో దాన్ని చులకన చేయాలని ప్రతిపక్షాలు ఆశిస్తున్నాయి. అది నెరవేరక పోవడంతో సభల్ని స్తంభింప జేయడానికి పూనుకొంటున్నారు. ప్రభుత్వం సర్దుబాటుకు సిద్ధమయినా, ప్రతిపక్షం మాత్రం తాను పట్టిన కుందేలుకు మూడేకాళ్లు అంటున్నాయి.

ఎందుకు అంటున్నాయో అర్థం చేసుకోవడం ఏమంత కష్టంకాదు. ఎన్నికల మీదనే వారి దృష్టి. కాంగ్రెస్‌ను ఇరకాటాన పెట్టడానికి ఇంతకంటే మంచి అవకాశం లేదని వారి అభిప్రాయంకావచ్చు. ప్రభుత్వాన్ని ఉక్కిరి బిక్కిరి చేసి తమ పంతం నెగ్గించు కుంటే ప్రజల దృష్టిలో తమ ప్రతిష్ట ఇనుమ డిస్తుందని, అది ఎన్నికలకు 'ఇంధనం' మాదిరి ఉపయోగ పడుతుందని వారు ఆశించి వుండవచ్చు. పి.వి. నరసింహారావు ఎప్పుడూ లేనిది ఇటీవల ఎన్నికల గురించి మాట్లాడు తున్నాడు. గడువుకు ముందే ఎన్నికలు జరగొచ్చునని ఆయన ఒక మాట జారవిడిచాడు. దానితో ప్రతిపక్షాలు ఎన్నికలకు సన్నద్ధమవుతూ ఆ వ్యూహంలో భాగంగా పార్లమెంట్‌ను స్తంభింప జేసే కార్యక్రమాన్ని చేపట్టి వుండవచ్చు.

ఐతే పార్లమెంట్ వున్నది ఇందుకేనా? రాజకీయ పార్టీలు రాబోయే ఎన్నికల పై దృష్టి పెట్టుకొని, తమ వ్యూహాన్ని రూపొందించు కోవడానికి పార్లమెంట్ సమావేశాలను ఉపయోగించు కోవడం సబబవుతుందా? జె.పి.సి. లోగానీ, మంత్రుల రాజీనామాల విషయంలో గానీ పి.వి. ప్రభుత్వాన్ని ఎవరూ సమర్థించ నవసరం లేదు. 96 సార్లు సమావేశమై, 410 గంటల సమయాన్ని వెచ్చించి దాదాపు 5400 మంది సాక్షుల్ని విచారించి తయారు చేసిన 470 పేజీలు జె.పి.సి. నివేదికకు ప్రభుత్వం ఇస్తున్న గౌరవం, ప్రాధాన్యం ఏ విధంగానూ సమర్థనీయం కాని మాటా వాస్తవమే! దానికి కొద్దిమంది ఉద్యోగుల చేత కేవలం 80 పేజీల్లో సమాధానం తయారు చేయిం చడంలోనే ప్రభుత్వ ఉద్దేశాన్ని అర్థం చేసుకోవచ్చు. ఐతే ఈ వ్యవహారాన్ని ప్రక్కదారి పట్టించడానికి ప్రభుత్వం ఎంత విపరీతంగా వ్యవహరిస్తుందో, దాన్ని ముగ్గులోకి తెచ్చి ప్రభుత్వాన్ని ముప్పుతిప్పలు పెట్టడానికి ప్రతిపక్షాలూ అంత విపరీతంగానే వ్యవహరిస్తున్నాయి. స్కామ్ వ్యవహారమే కాదు, ఏ కుంభకోణమైనా పార్లమెంట్ ద్వారా ప్రజల దృష్టికి వస్తుంది. దానికి ప్రభుత్వం ఎట్లా స్పందిస్తుందన్నది ప్రజలు గమనిస్తారు. దాని పై నిర్ణయం వారే చేసుకొంటారు. ఆ నిర్ణయాన్ని ఎన్నికల్లో ఓట్ల ద్వారా తేట తెల్లం చేస్తారు. ప్రజలు ఒక నిర్ణయానికి రావడానికి, ఒక అభిప్రాయం ఏర్పరచు కోవడానికి మాత్రమే ప్రతిపక్షాలు ప్రయత్నించాలి

కొరవ 8వ పేజీలో

## గయ్యాళి డాక్టర్

- రసిక్

అఘాయిత్యాల అత్త అరిందా అత్త,
దర్పాల అత్త, దాబుసరి అత్త
మగణ్ణి కొంగున బిగించుక తిరిగే అత్త
కొడుకుల నోళ్ళు కట్టి పడేసే అత్త
కూతుళ్ళను గోము చేసి పెంచే అత్త
కోడళ్ళను రాచి రంపాన బెట్టే అత్త
శాంతి నివాసాల శాంతిని హరించే అత్త
చక్కని కాపురాలు కూల్చే అత్త
అత్తా ఒకింటికోడలే అని అనుకోని అమె
సాధింపుల అత్త, వేధింపుల అత్త
నోటితీట అత్త, చేతివాటం అత్త
గడుగ్గాయి అత్త, పిడుగులాంటి అత్త
గడగడ లాడించే గయ్యాళి గంప అత్త
అత్త అన్న పదంలో ఇమిడి వున్న
ఈ సమస్త బహుముఖ రూపాలను
అనన్యంగా, అసదృశంగా
అలవోకగా, అనర్గళంగా
ఇన్ని దశాబ్దాల తరబడి ఏకథాటిగా
ఆంధ్రుల వెండితెరపై
ఆవిష్కరించిన, అందించిన
''మహిళకు మహిళే శత్రువు''
అన్న నగ్న సత్యాన్ని నిరూపించిన
మన సూర్యకాంతమ్మకు
మహిళా విశ్వవిద్యాలయం
డాక్టరేట్ యిచ్చి సన్మానించిందంటే
మహిళప్రతిభకుపట్టం కట్టకలిగేది కూడా
మహిళే కాబోలనుకొని తీరాలి
మనమంతా!

* * *

సహజంగా సాత్త్వికుడైన నాగయ్య
సాత్త్విక పాత్రల్లో ఎంతో రాణించి
వుండవచ్చుగాక
నిజజీవితంలో సాత్త్వికతకు
పేరుగన్న వ్యక్తి
సినిమా జీవితంలో తోటి నటీనట
వర్గాన్ని
తనమాటలతో, చేతలతో వెండాడుతూ
దడదడలాడిస్తూ ప్రత్యక్షం కావటం
ఆ ఆర్భాటానికి ప్రేక్షకులు యావన్మంది
నోరు నొక్కుకుంటూమొటికలు
విరువడం-
అది, అభినయ చాతుర్యానికి
అత్యుత్తమ పరాకాష్ట

* * *

భానుమతి, సావిత్రి ఎంతఅరుదైన
వ్యక్తులో
సూర్యకాంతంకూడా అంతే అరుదైన వ్యక్తి
అరుదైన వ్యక్తుల కన్నివిధాలా
అపురూపమైన సన్మానాలు జరుగ
వలసిందే.
ప్రభుత్వాలూ, సంస్థలు జరిపే
సన్మానాలకన్నా
ప్రజలు జరిపే సన్మానాల తీరే వేరు
వారెన్నడో తమ నిఘంటువుల్లో ఆమె
పేరును
గయ్యాళికి పర్యాయ పదంగా
వ్రాసేసుకున్నారు
''లోకుల నాలుకలే తాటాకులుగా''

(ఇటీవల పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం వారు నటి సూర్యకాంతం గారికి డాక్టర్ ఆఫ్ లిటరేచర్ ఇచ్చి గౌరవించిన సందర్భంగా...)



## రేబాల గ్రామ పంచాయితీ - టెండరు ప్రకటన

నెల్లూరు జిల్లా రేబాల గ్రామ పంచాయితీకి 1994 - 95 సంవత్సరమునకు ఈ దిగువ తెల్పిన పని చేయుటకు సీలు వేసిన టెండర్లు 8.8.94 తేదీ మధ్యాహ్నం 2.00 గంటల వరకు పంచాయితీ కార్యాలయములో పంచా యితీ కార్యనిర్వ హణాధికారిచే స్వీకరించ బడును. అదే రోజు మధ్యాహ్నం 3.00 గంటలకు టెండర్లు తెరువ బడును. టెండర్లు దాఖలు చేయు వారు నిర్ణీత ధరావత్తు చెల్లించి రసీదును సదురు జతపరచ వలయును. టెండర్లు స్వీకరించుటకు లేదా తిరస్కరించుట కార్యనిర్వహణాధికారికి అధికారము కలదు. మిగతా వివరములు కార్యాలయము పని చేయు వేళలలో తెలుసు కొన వచ్చును.

| వ.నెం. | పని వివరములు | ధరావత్తు |
|---|---|---|
| 1. | 1994 - 95 సంవత్సరమునకు రేబాల గ్రామ పంచాయితీలో ఊరకుక్కలను పట్టుట (కుక్క 1కి రేటు) | 25.00 |

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

# పురిటిలోనే సంధి ?

దరిద్రుడు తల కడగ బోతే వడగళ్ల వాన కురిసిందట. అట్లా తయారైంది కృష్ణపట్నం కథ. కృష్ణపట్నం మీద నెల్లూరు జిల్లాకు ఎన్నో ఆశలున్నాయి. ఆ ఆశలు ఈనాటివి కాదు; దాదాపు 150 ఏళ్ళ కిందట కృష్ణపట్నాన్ని ఓడ రేవుగా అభివృద్ధి చేయాలన్న ప్రయత్నం మొదలైన నాటివి. అప్పట్లో బ్రిటీష్ ప్రభుత్వం తన ప్రయోజనాలకోసమే అయినా, కృష్ణపట్నాన్ని ఓడరేవుగా తీర్చి దిద్దాలని ప్రయత్నిస్తే, బంగాళా ఖాత తీరంలో ఏర్పడిన ఇసుక దిబ్బ వల్ల ఓడలు రేవు చేరడం దుస్సాధ్యమని తేలి ఆ ప్రయత్నాన్ని విరమించు కోవలసి వచ్చింది. ఆనాటి నుంచి కృష్ణపట్నం కేవలం విహార స్థలంగా మాత్రమే వుపయోగ పడుతూవుంది. ఐతే పది సంవత్సరాల కిందట మళ్లీ దాన్ని ఓడరేవుగా ఉపయోగించు కునే ప్రయత్నం సాగింది. అప్పటికీ ఇసుక దిబ్బల ఆటంకం తప్పక పోయినా, సాంకేతిక పరిజ్ఞానంతో దాన్ని అధిగమించి సరకుల రవాణా ప్రారంభించారు. రవాణాయేమంత ఎక్కువ కాక పోయినా, ఇప్పటికీ కొన సాగుతూనే వుంది.

ఇంతలో కృష్ణపట్నాన్ని థర్మల్ విద్యుత్ కేంద్రంగా రూపొందించాలనే ప్రతిపాదన రావడంతో దాని రూపురేఖలతో పాటు జిల్లా అభివృద్ధికూడా మెరుగు కాగలదని ఆశించాం. కానీ ఆదిలోనే హంస పాదన్నట్లు కృష్ణ పట్నం థర్మల్ విద్యుత్ ప్రాజెక్టు కాగితాల మీద వుండగానే వివాదాల్లో చిక్కుకుంది. ఇన్నాళ్లూ వ్యక్తిగతంగా అపనిందలకు అవినీతి ఆరోపణలకు గురికాకుండా పాలన సాగిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి కృష్ణపట్నం థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుతో వివాదాల ఊబిలో దిగబడి పోయారు. ఈ ప్రాజెక్టు టెండర్లు ఖరారు చేయడంలో ఆయన బంధు పక్షపాతం వహించాడనే ఆరోపణ వచ్చింది. వెయ్యి మెగావాట్ల యూనిట్‌ను రెండుగా విభజించడంలోనే దురుద్దేశం బయట పడిందని. అందులో ఒక భాగాన్ని తన అల్లుడి [illegible] విదేశీ కంపెనీకి, మరో భాగాన్ని ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి బంధువుల కంపెనీకి యివ్వడం ఏ విధంగా చూసినా అక్రమమేనన్న ఆరోపణను ఎవరూ సమర్థ వంతంగా ఖండించ లేక పోయారు. బ్రూక్లిన్ కంపెనీతో తనకు సంబంధం లేదని ముఖ్యమంత్రి అల్లుడు ప్రకటించినా, అది 'తదనంతర చికిత్స' మాత్రమేనని తెలియని వారెవరూ లేరు. పైగా ఆ కంపెనీని అమెరికాలోని చీఫ్ సెక్రటరీ సోదరుడు స్వాధీనం చేసుకో బోతున్నారన్న ఆరోపణకు కూడా సరైన సమాధానం లేదు. అదే విధంగా కాంట్రాక్టు రెండో భాగాన్ని పొందిన కంపెనీ యాజమాన్యానికి, చీఫ్ సెక్రటరీకి వున్న బంధుత్వాన్ని కూడా ఎవరూ తోసి పుచ్చలేరు.

ఇదంతా పత్రికల కెక్కి, ప్రతిపక్షాల విమర్శలకు గురై రచ్చ కెక్కి రభస పట్టినా, ప్రభుత్వం దీన్ని సమర్థించు కోడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నదే కాని, కాంట్రాక్టు రద్దు చేసి తన నిర్దోషిత్వాన్ని చిత్తశుద్ధిని నిరూపించుకొనే ధోరణిలో లేదు. పైగా ఆరు నూరైనా కాంట్రాక్టు కొనసాగు తుందని నిస్సిగ్గుగా ప్రకటిస్తూంది. ప్రజా జీవితంలో విశ్వాసం మూరగొనడం ఎంత కష్ట సాధ్యమో, దాన్ని నిలబెట్టు కోవడం అంత కంటే వంద రెట్లు కష్ట సాధ్యం. ఒక చిన్న రాయి చాలు అద్దాన్ని పగుల గొట్టడానికి! కొడుకుల, అల్లుళ్ల పేరుతో భ్రష్టు పట్టిన నాయకులు తక్కువేమీ కాదు. ఆ జాబితాలో విజయ భాస్కర రెడ్డిని కూడా చేర్చడానికి 'కృష్ణపట్నం' పనికొచ్చింది.

ఇప్పటికైనా మించి పోయింది లేదు. ప్రభుత్వం మంకు పట్టు వదలి, వెంటనే కాంట్రాక్టులు రద్దు చేసి, న్యాయ బద్ధంగా, నిష్పక్షపాతంగా నిర్ణయం తీసు కోవడమో, లేక మొత్తం టెండర్లనే రద్దు చేసి మళ్లీ కొత్త టెండర్లు పిలవడమో చేయాలి. మొండి పట్టువల్ల నష్టమే తప్ప మరే ప్రయోజనమూ లేదు. కృష్ణపట్నం వ్యవహారంలో అంతా సవ్యంగా లేదని, ప్రభువుల చేతులు మలినం కానే అయ్యాయని స్పష్టమై పోయింది. ఇక దీన్ని మసి బూసి మారేడు కాయచేసి లాభం లేదు. అందువల్ల ముఖ్యమంత్రికే కాక, కాంగ్రెస్ పార్టీకి కూడా తీరని నష్టమే జరుగుతుంది. ఎన్నికలు దగ్గరపడు తున్న సమయంలో నేతలు మరింత జాగరూకతతో వ్యవహరించాల్సింది పోయి, దక్కినంత వరకు చక్కబెట్టుకొనే ధోరణిలో పడితే పార్టీ నామరూపాల్లేకుండా పోతుంది.

కృష్ణపట్నం వివాదాన్ని ఇంతటితో ముగించడం అందరికీ మంచిది. మళ్లీ టెండర్లు పిలిచి, నిష్పాక్షికంగా కాంట్రాక్టు యిచ్చి కృష్ణపట్నం విద్యుత్ కేంద్రాన్ని పటిష్టంగా రూపొందించేందుకు ప్రభుత్వం తగిన చర్యలు తీసుకొంటుందని, అందుకు తగిన విజ్ఞత, విశాల దృక్పథం దానికి కలగాలని ఆశిస్తున్నాము. కృష్ణపట్నం థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుకు పురిటిలోనే సంధి కొట్టకూడదని కూడా ఆశిస్తున్నాము.

# ఆర్వీ పై ధ్వజమెత్తడం ఒక పన్నాగమే?

ఇంతవరకు ఏ రాష్ట్రపతి తన భావాలు నిక్కచ్చిగా పేర్కొననట్లుగా మాజీ రాష్ట్రపతి ఆర్. వెంకట్రామన్ 'మై ప్రెసిడెన్షియల్ ఇయర్స్' పుస్తకంలో వ్రాసారు. రాజీవ్ గాంధీని స్థాయికి మించి పొగిడినందుకు కాంగ్రెస్ వారులంతా ఆర్వీని సత్కరించాల్సింది పోయి విమర్శలు గుప్పిస్తున్నారు. ఇదంతా వీరు సోనియా గాంధీని తృప్తి పరిచే పన్నాగం. రాబోయే ఎన్నికల్లో ప్రతిపక్షాలు బొంతల కుట్టు కనుక మళ్లీ కాంగ్రెసే అధికారంలోకి వస్తుంది. అపుడు సోనియా గాంధీనో, ప్రియాంకనో ప్రధాని కుర్చీలో కూర్చోబెట్టి వాళ్లను నిర్వీర్యపరచి దేశాన్ని దోచుకొనే ఎత్తుగడలో రాజీవ్ విధేయులున్నారు. సంస్కారం విద్య పెరిగి కొద్దీ వికృత మనస్తత్వాలు పోవాలి గాని అవిపెచ్చు పెరుగుతున్నాయి. రాజ్యకాంక్ష, ధనదాహం, స్వార్థమో రాజకీయుల చేత ఈ పని చేయిస్తుంది.

నెల్లూరు. -అవులకొండయ్య

### ఏసిలేని ఏసి థియేటర్లు

హోటళ్ళూ, సినిమాహాళ్ళ నిర్మాణం లోనూ, నిర్వహణ లోనూ నెల్లూరీయులకు ఎంతో పేరుంది. హోటళ్లు ఆ పేరును కాస్తో, కూస్తో నిలబెట్టుకుంటూ వస్తున్నాయి. కానీ థియేటర్లు, ముఖ్యంగా ఏసి థియేటర్లు పేరుకే. ఏసి లేదు, గీసీ లేదు. టిక్కెట్ ఛార్జీలో మాత్రమే యమ ఏసి. మన థియేటర్లు ఎంత రిచ్‌గా, కళాత్మకంగా, ఆహ్లాదకరంగా ప్రారంభం అవు తున్నాయో అందరికీ తెలుసు. కాని ఆదిలో వున్న అభిరుచి, ఆసక్తి మధ్యలో అడుగంటి పోతున్నాయి. టౌన్‌లోని ఏసి థియేటర్ల యజమానులు కేవలం వ్యాపారులేకాదు, రాజకీయ ప్రముఖులు కూడా వున్నారు. హైదరాబాద్ వంటి సిటీలలో థియేటర్ల యజమానులు సౌకర్యాల విషయంలో ఎంతో అప్రమత్తంగా వుంటారు. ఏసి సౌకర్యం లేనప్పుడు సంజాయిషీ ఇచ్చుకుంటారు; నాన్ ఏసి రేట్లు వసూలు చేస్తారు. గతంవారం రోజులుగా టౌన్‌లోని ప్రముఖ థియేటర్ల వారు రేట్లు, పెంచారుకాని, ఏసిని ఈసేసి థియేటర్ల తలుపులు బార్లా తెరిచేసి సినిమాలు ప్రదర్శిస్తున్నారు. చెమట సముద్రంలోకి ప్రేక్షకుల్ని తోసి థియేటర్ల వారు నేరించడం దారుణం. మహానుభావులారా! మన థియేటర్లు టౌన్ బస్‌ల స్థాయికి దిగజారక ముందే ఎవరికైనా 'దత్తత' కు ఇవ్వడం బాగుంటుంది.

నెల్లూరు. -ఎస్.వినోదిని

### రేషన్ షాపుల వద్ద బోర్డులు పెట్టాలి!

టౌన్‌లోని రేషన్ షాపులవారు అనేక అక్రమాలకు పాల్పడి ప్రజలను ఇబ్బంది పెడుతున్నారు. అధికారులు చూసి చూడనట్లు వ్యవహరిస్తుండడం వల్ల వీరు మరీ శ్రుతి మించు తున్నారు. ప్రజలకు సక్రమంగా రేషన్ అందచేయడంలో భాగంగా ముందు ఏ ఏ వస్తువులు, రంగుల వారీ కార్డులకు ఏ మోతాదులో ఇస్తారన్నది బహిరంగంగా బోర్డులపై రాయించాలి. ఏ ఏ తేది వరకు ఇస్తారు?, పండుగల సందర్భంగా ప్రత్యేకంగా ఇచ్చే కోటాల విషయం కూడా దానిపై ప్రకటించాలి. ఈ విధంగా చేస్తే ప్రజలు రేషన్ షాపుల వారిని అడుగ గలుగుతారు. అధికారులు ఈ విధానం సక్రమంగా అమలయ్యేందుకు అప్పుడప్పుడు తనిఖీలు చేస్తే ప్రజలకు సక్రమంగా రేషన్ అందుతుంది.

నెల్లూరు. -పి.వి.రమణారెడ్డి

కొరవ 6 పేజిలో

## 50 ఏళ్ళ క్రితం ఈవారం

4 -8 - 1944

పేజీలు : 6 వెల : 0-1-6

### నెల్లూరు ముచ్చట్లు

#### జిల్లా బోర్డు మీటింగు

31తేది జరిగింది. సభ్యత్వం గోల్పోయిన సభ్యులకు తిరుగా ఆయుస్సుపోసారు. సన్నపురెడ్డి శేషరెడ్డిగారి (లక్ష దానానికి తూటు) య 25లు భూములను రు.66300 లకు యాలం పాడిన సన్నపురెడ్డి కృష్ణారెడ్డిగారి పాటను ఖాయపరచారు. మందు వస్తువులకు కొత్త టెండర్లు పిల్చారు. స్టోరు చిల్లర వస్తువులకు క్లైప్రభాతవారి టెండరు ఆమోదించారు. ఇంతకంటే చెప్పదగిన తీర్మానాలేవీ లేవు.

### వి.ఆర్‌ఆర్.కాలేజి.

ప్రిన్సిపాల్ యింకారాలేదు. రిలీఫ్ రాగానే వస్తానని వ్రాశారట. వీరి జీతం 350 -25 /1- 500 బు గ్రేడని అధికార రీత్యా తెలుస్తున్నది.

లయోలా కాలేజీలో మాంచి పేరు ప్రతిష్టలు సంపాదించిన కె. సుబ్రహ్మణ్యం, యం. ఏ. గారిని గూడ యింగ్లీషు బోధకుడుగా నియమించారు. జీతం రు180.

అసిస్టెంటు ప్రిన్సిపాల్ నిర్ణయమున్నూ, గుజ్జం- డిపార్టుమెంటల్ హెడ్ అనే విషయమున్నూ యింకా తీర్మానం కాలేదని అధికార వార్త అంటున్నది.

* * *

### స్త్రీల కళాశాల

సదాశివరెడ్డిగారిని దర్శించి అడుగగా గతపర్యాయం తాను నెల్లూరు వచ్చినప్పుడు శ్రీ దువ్వూరు నారాయణరెడ్డిగారు తనకై తానే స్త్రీల కళాశాలను తాను నిర్మింప నుత్సహించి అందుకు అవసరమైన సలహాలు పొందారని చెప్పిరి. ఈ వార్త ఉత్తరాదినంతా ప్రాకిపోయింది. మొన్న శ్రీ గోపాలు రెడ్డిగారిని పశ్చిమ గోదావరి జిల్లావారు గూడాఅతురతగా అడిగారట.

శాస్త్రులవారి సాహిత్యాన్ని పదివేలతో పూజించారు. నైషధాది ఉద్గ్రంధాలను వెలికి తీశారు. 60వేలతో పురమందిరాన్ని నిర్మించారు. ఆంధ్రా యూనివర్సిటీకి 25వేలు విరాళమిచ్చారు. వెయిన్ని మాట పరహార్లతో కవుల పూజిస్తున్నారు; ఒకరు స్త్రీల హైస్కూలును, మరొకరు స్త్రీల కళాశాలను పూజింప నున్నారంటె నెల్లూరు రెడ్డి సంఘోద్యానం పుష్పించి పరిమళభరితమైన ఆంధ్రదేశానికంతటికి తావులు ఎగ జిమ్ముతున్న దన్నమాట. ఇంకా త్రవ్వితే ఎన్ని మరకత, మాణిక్య, వజ్ర వైఢూర్యాదులున్నవో యీ రెడ్ల గనిలో కాలగర్భమే నిరూపింప గలదు. భళి; దువ్వూరు నారాయణరెడ్డి;

### అధికార వర్గం

జిల్లా హెల్త్‌ఆఫీసరు ఏనుగ సుందరరామరెడ్డి గార్ని అప్పుడే తూర్పుగోదావరికి మార్చివారా?

### సుజనరంజనీ సమాజం

పొట్లపూడి గ్రామంలో పై సమాజం వారు 1తేది రాత్రి చిత్రనళీయమును ప్రదర్శించిరి. ఆరితేరిన నెల్లూరు నటులతో పోల్చి చూస్తే విజ్ఞాన, సాధన సంపత్తులులేని పల్లెటూరు వారే, మెరుగనిపించారు. ప్రత్యేకంగా నలుడు ప్రథమ ఘట్టంలోనూ, దమయంతి ఆద్యంతాలును భేషుగ్గా వుండిరి.

కొరవ 10 పేజిలో



వేమన జయంతి సభలో గునుపాటి ఆదిశేషారెడ్డి సన్మానం అందుకొంటున్న డాక్టర్ రావి భారతి. ఎడమ వైపు వర్తమాన సమాజ కార్యదర్శి బి.వి. నరసింహులు. కుడి వైపు సభాధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి.

# తొలి సామాజిక కవి వేమన

వేమన జయంతి సభ వర్తమాన సమాజ యాజమాన్యాన 3వ తేదీ టౌన్ హాల్‌లో సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షతన ఘనంగా జరిగింది. హైదరాబాద్ వెంకట్రామ రెడ్డి మహిళా కాలేజి తెలుగు శాఖ రిటైర్డ్ లెక్చరర్ శ్రీమతి రావి భారతి. ముఖ్య వుపన్యాసకులు. డాక్టర్ గోపాల రెడ్డి మాట్లాడుతూ తెలుగు భాషలో నీతి పద్యాలు అనుకున్న మరో క్షణంలోనే వేమన శతకం గుర్తుకు వస్తుందిఽ వేమన ఏ ప్రాంతంలో వుండే వాడో, ఏ కులంలో జన్మించాడో మనకు స్పష్టంగా

## వేమన జయంతి

తెలియక పోయినా ఆయన పద్యం తెలియని తెలుగు వాడు వుండడన్నారు. ప్రజలలో వేమనకున్న ప్రాచుర్యాన్ని గమనించి సి.పి. బ్రౌన్ ఆయన పద్యాలు సేకరించి, వివాదాలు పరిష్కరించి ప్రచురించినట్లు చెప్పారు. బ్రౌన్ సేవా ఫలితం గానే వేమన పద్యాలు ప్రజల వాడుకలోకి వచ్చాయిఽ శతకకర్తలలో ఇంతటి కీర్తి సంపాదించిన కవి మరొకడు లేడని డాక్టర్ గోపాలరెడ్డి ప్రశంసించారు. సన్మాన గ్రహీత శ్రీమతి రావిభారతి వేమన పద్యాలలో వెల్లి విరిసిన మానవతా వాదం పై చక్కని ప్రసంగం చేసి శ్రోతలను అలరించారు. ఆట వెలది పద్యాలలో వాడియైన నీతులను పొందు పరచి వేమన శతక రచనలో కొత్త పంథాను తొక్కాడు. ప్రతి పద్యంలోనూ సామాజిక స్థితి గతులను అనుభవ పూర్వకంగా అకళింపు చేసుకొని, హేతు వాదంతో వితర్కించు కొని సాంఘిక దురాచారాలను మత ఛాందసాన్ని తూర్పార పట్టినట్లు చెప్పారామె. వేమన కవి సమకాలంలో రాజుల అహంకారం, మతం పేరుతో మోసాలు, పన్నుల వసూళ్ల పేరుతో దోపిడి, విటుల, వేశ్యల విశృంఖల విహారం, కులాల విజృంభణ మానవ జీవితాన్ని దుర్భరం చేసి పెట్టింది. దీనుల, సామాన్యుల కష్టాలను కళ్లారా చూసిన కవి నీతి పద్యాలలో చురకలు వేసినట్లు చెప్పారామె. వేమన పై ఎందరెందరో విమర్శకులు కుల విరోధి, స్త్రీ విరోధి, బ్రాహ్మణ విరోధి, అధికార విరోధని ఆరోపించారు. కాని వేమన కావించిన సమాజ దోషణలోని అవగాహన లోపమే కారణం కాని, వేమన కాంక్షించిన సమాజ శ్రేయస్సు మానవతా వాదంలో నిండి వున్నట్లు వివరించారు.

వ్రాత కొలది గాని వరవిూడు దైవంబు, చేతో కొలది గాని వ్రాత లేదు. వ్రాత కజుడు కర్తఽ చేతకు తాకర్త అంటూ తెలుగు సాహిత్యం నిల్చి నంతకాలం వేమన ప్రస్తుతింప బడతారని ముగించారు. అనంతరం గునుపాటి యానాది రెడ్డి సాహితీ హృదయానికి స్మృత్యంకంగా గునుపాటి ఆదిశేషా రెడ్డి శ్రీమతి భారతిని పట్టు శాలువాతో ఘనంగా సన్మానించారు. తొలుత సమాజ కార్యదర్శి బి.వి. నరసింహం స్వాగత వచనాలు, చివరన వందనాలు చెల్లించారు. వక్తను అగస్త్యరెడ్డి వెంకురెడ్డి సభకు పరిచయం చేసారు.

## కేంద్ర సహకార బ్యాంకులో వడ్డీ జాస్తిగా ఇస్తారట!

విదేశాల్లో సహకార వ్యవస్థ పని తీరు పరిశీలించేందుకు జిల్లా

కొరప 8వ పేజీలో



# మాలలతోనే సరి... 'మహిళా కాంగ్రెస్'!

ఎవరే మనుకున్నా వాస్తవాన్ని కుండ బద్దలు కొట్టినట్లు చెప్పడంలో జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డిది విలక్షణ శైలి. అది పబ్లిక్ మీటింగా, పార్టీ మీటింగా, ప్రెస్ మీటా? అని చూసుకోడాయన. సొంత పార్టీ వారు అలుగు తారని, మిగతా వారు విమర్శలు గుప్పిస్తారని మొహమాట పడడు పెద్దాయన! రాష్ట్ర మహిళా కాంగ్రెస్ ఇన్‌ఛార్జి అధ్యక్షురాలు శ్రీమతి దుర్గా భక్తవత్సలం రాకను పురస్కరించుకొని జిల్లా మహిళా కాంగ్రెస్ నేతలు 2 తేది ఇందిరా భవన్‌లో సభ పెట్టారు. ముందు వది వరుసల కుర్చీలకు కూడా సరి పోయ్యేంత మంది మహిళలు లేక సభ వెల వెల పోయింది. వేదిక విూద నాయకురాళ్లకు ఒకరంటే మరొకరికి పడదు. తరలించుక వచ్చిన సొంత మనుషుల చేత ఎవరికి వారే మాలలు వేయించు కొనే కార్యక్రమం మొదలెట్టారు. జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు కె. రమణమ్మ ఏం మాట్లాడిందో ఆమెకే తెలియాలి. వీరి తీరు చూసి అప్పటికే ఓపిక చచ్చి వేదిక పై నసుగు తుండిన ఆనం సంజీవ రెడ్డికి మాట్లాడే అవకాశ మిచ్చింది. అంతే, మహిళా నాయకు రాళ్లపై నిప్పులు చెరిగారు. చెప్పుకొంటే సిగ్గు చేటు. [illegible] నామినేటెడ్ పదవులకు [illegible] పుష్పాలతో సరిపెట్టు కొంటున్నారు. మహిళలను చైతన్య పరిచే స్థితిలో విూరు లేరు. ఒక మహిళ ఎమ్మెల్యేగా వుంటే మహిళల సమావేశానికి ఆమెను పిలువ లేదు. పోనీ రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షురాలు వస్తుందని మహిళలను తరలించుకొని రాలేదన్నారు. ఎలక్షన్స్ నూరు రోజులున్నాయి; సారా వుద్యమం మూలంగా రాష్ట్ర స్థాయిగా పేరు గాంచిన నెల్లూరు జిల్లాలో మహిళలను ఒక్క అసెంబ్లీ సీటుకైనా పోటీ చేయించక పోతే పార్టీకి ఎంతఅవమానమో చెప్పండి. ఈ పరిస్థితిని నెగ్గుకు రావాలంటే రాజకీయ నిర్మాణంలో డిమాండ్ చేసే స్థితికి రావాలన్నారాయన. హాల్ పట్టకుండా మహిళలొస్తారని అనుకొన్నా. అంతంత మాత్రమే వచ్చారు. జిల్లాలో అక్టోబరు నుండి సంపూర్ణ మద్య నిషేధం విధించాలని భాట్టం శ్రీరామ మూర్తి ప్రభుత్వాన్నికోరి వున్నారు. వుద్యమంలో పని చేయడంలో ఎలాగూ వెనుక బడి పోయాం. ఈ సారి ప్రచారం విషయం లోనైనా ప్రజల్లోకి వెళ్లి పని చేద్దామని సూచించారు సంజీవ రెడ్డి. ప్రభుత్వం వైఖరి ఏం బాగలేదు. సారా నిషేధ ప్రచార కమిటీలో ప్రప్రభుత్వానికి స్వర్ణా వేమయ్య, అనంత రామయ్య వంటి కమ్యూనిస్టులు కనపడ్తారే తప్ప ఒక్క మహిళా కనపడక పోవడం బాధాకరమన్నారు. మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు ఎంత సేపటికి ఎమ్మెల్యే ఆఫీసుకే పరిమిత మవుతుంది. అదేమంటే వేరే పార్టీల వాళ్ల ధర్నాలలో వెళ్లి కూర్చొంటానంటుంది. పార్టీ పరంగా చేపడుతున్న కార్యక్రమాల పట్ల మహిళల్లో చైతన్యం కల్గించడంలో మహిళా కాంగ్రెస్ పూర్తిగా విఫల మైందని విమర్శించి కూర్చొన్నా [illegible]!

పెద్దాయన మాటలు వినేసరికి శ్రీమతి దుర్గాభక్తవత్సలానికి కూడా కోపమొచ్చేసింది. నెల్లూరు మహిళల సారా వుద్యమం ప్రపంచ వ్యాప్తంగా పేరు గాంచితే మహిళా కాంగ్రెస్ కార్యకర్తలు దానిలో ఎందుకు పాల్గొన లేదని ప్రశ్నించిందామె. సమావేశం హాజరైన మహిళలను చూస్తుంటే

ఇక్కడి మహిళా కాంగ్రెస్ పని తీరు తెలిసిపోతుంది. నాయకురాళ్లకు పదవీ వ్యామోహం కాదు పార్టీ పట్ల విధేయత, గౌరవం వుండాలి. మహిళలు దారిన పోతుంటే చేతులెత్తి నమస్కరించేంతటి సంస్కారాన్ని మనం వృద్ధి చేసుకోవాలి. మహిళల్లో అంతర్గతంగా



రాష్ట్ర మహిళా కాంగ్రెస్ ఇన్‌ఛార్జి శ్రీమతి దుర్గా భక్తవత్సలంకు 'గరుడసేవ' మాల వేసి ఆనందిస్తున్న నెల్లూరు మహిళా నాయకులు.

శక్తి దాగి వుందని గ్రహించిన స్వర్గీయ ఇందిరా గాంధీ మహిళా లోకానికి రాజకీయ శక్తి ఎందుకు ఇవ్వకూడదని ప్రశ్నించి అవకాశం కల్పించారు. ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వం మహిళలకు 33 శాతం రిజర్వేషన్ స్థానిక సంస్థల్లో పోటీ చేసేందుకు కల్పించింది. సమర్థులు లేకపోతే మహిళలకు సీట్లిచ్చి గౌరవం పోగొట్టులే మన్నారామె. ఎన్ని కోట్ల రూపాయలు వెచ్చించి ప్రభుత్వ ఆర్థిక పథకాలను విస్తరిస్తున్న పుటికి మహిళలకు లబ్ధి అందడం లేదన్నారు. మహిళలకు అందే లబ్ధిని గూర్చి సరియైన ప్రచారం మహిళా కాంగ్రెస్ చేయక పోవడం బాధాకర మన్నారు. మనలో స్వాతంత్ర్యం విలువ ఎంత మందికి తెలుసు. సమాజం ఇట్లానే వుంటే మళ్లీ స్వాతంత్ర్యం కోల్పోక తప్పదని ఇది గ్రహించి మహిళలు ముందడుగు వేయాలని కోరారు.

మాజీ శాసన సభ్యుడు కె.వి. సుబ్బారెడ్డి ఇటీవల మహారాష్ట్ర 'జల్‌గావ్' లో మహిళలకు జరిగిన అన్యాయాల పేపర్ కట్టింగ్‌లను మళ్లీ చదివి వినిపించారు. రాష్ట్ర మహిళా కాంగ్రెస్ జనరల్ సెక్రటరీ శ్రీమతి మంజుల మాట్లాడుతూ దేశంలో 52 శాతం మంది మహిళలు వున్నా

చైతన్యం కరువవ్వడం పట్ల ఆశ్చర్యం ప్రకటించారు. వేదిక పై మహిళా కాంగ్రెస్ జిల్లా అధ్యక్షురాలు కువ్వారపు రమణమ్మ, స్వర్ణ లతా రెడ్డి, నిర్మలా రెడ్డి, బి.వి. లక్ష్మి, దినకర్ రెడ్డి భవాని, నాగేంద్ర ప్రసాద్ ఆశీను లయ్యారు. బాలాజీ నగర్ కాంగ్రెస్ నాయకురాలు పెండ్లపర్తి అరుణమ్మ పట్టు చీరతో పాటు నలుగురు

సాయంతో తీసుకొచ్చిన దండను దుర్గా భక్తవత్సలానికి వేయగా, స్వర్ణలతా రెడ్డి తళతళ లాడే శాలువా కప్పారు. మీటింగ్‌లో పాల్గొన్న మగ నాయకులంతా జిల్లా మహిళా నాయకురాళ్లను తప్పు పట్టే ముందు మహిళా కాంగ్రెస్ [illegible] సిద్ధికి ఏ పనైనా చేసారా అని [illegible]ంచి వుంటే బాగుండేది.

## నెల్లూరు సంగతులు

### పొదుపు లక్ష్మి పై డాక్యుమెంటరీ

జిల్లాలో మహోద్యమంతా సాగుతున్న పొదుపు లక్ష్మి వుద్యమాన్ని దూరదర్శన్‌లో ప్రదర్శించేందుకు ఫిలిమ్ అండ్ టెలివిజన్ అసోసియేట్స్ ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని తీస్తుంది. వుద్యమం వుపయోగాలతో పాటు, అపోహలను కూడా తొలగించేందుకు 23 నిముషాల నిడివి గల ఈ చిత్రం ఎంతగానో వుపయోగ పడుతుందని నిర్మాత శ్రీమతి ఎన్. పద్మ చెబుతున్నారు. 3 తేదీ విడవలూరులో షూటింగ్ కూడా ప్రారంభమైన చిత్రానికి సెూత్రాలు ప్రత్యేక అధికారిణి శ్రీమతి విజయ భారతి రచన చేసారు. కవి, రచయిత, జయంపు కృష్ణ స్వీన్నెట్ కూర్పుగా గుణశేఖర్ దర్శకత్వం వహిస్తున్నారు.

# నెల్లూరు గుసగుసలు

## వీక్షకుడు

### జనార్థన రెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్థన రెడ్డి 10 తేది నెల్లూరు వస్తారని అనధికార సమాచారం.

### మర్జీరాక

పిసిసి అధ్యక్షుడు మర్రి తులసీదాస్ 7వతేది నెల్లూరు వస్తున్నారు. ఉదయం సభ్యత్వం గూర్చి చర్చలు; సాయంకాలం ఇందిరాభవన్‌లో కార్యకర్తల సమావేశం. శాసన సభ్యులు, కార్యకర్తలు, అభిమానులను రమ్మని పిలుస్తున్నారు పిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి.

### ఎందుకీ టెలిఫోన్లు?

-తగలబెట్టడానికా? అందుకు కూడా పనికిరావు. ఎప్పుడు చూసినా డెడ్‌అఫ్ ఆర్డర్. కారణమేమిటని అడిగితే జవాబు చెప్పే నాధుడు లేడు. ఒక వేళ తప్పిదారి పనిచేసిందే అనుకోండి. అప్పుడు ఖాయంగా, ఖరారుగా, ఖచ్చితంగా రాంగ్ నెంబరు వచ్చితీరుతుంది. ఒక్క కాల్‌కు కనీసం మూడు రాంగ్ నెంబర్లు తప్పవు. అసలు ఒక నెంబరు డయల్ చేయగానే డిస్ కనెక్టు అయిపోతుంది. ఒక్కొసారి మధ్యలో డిస్ కనెక్ట్ అవుతుంది.

అధికారులేమో ఆధునీకీకరణ అంటూ పెద్దపెద్ద కబుర్లు చెప్పి పూరిస్తారు. చూడబోతే బిల్లు దిగేరుస్తున్నాయి. బిల్లులు మాత్రం ఠంచనుగా వస్తాయి. కట్టకుంటే కనెక్షన్ తీసేస్తామంటారు. తీసేసినా పీడాపోతుంది.

### నడిబజారులో టపాకాయల గోడౌన్లు!

చిన్న బజారులో ఒకటోతేది సాయంకాలం ఒక టపాకాయల గోడౌన్ పేలి శ్రీనివాసులు అనే 18 ఏళ్ల యువకుడు అక్కడికక్కడే చనిపోయాడు; దాదాపు కొన్ని లక్షల రూపాయలు విలువ చేసే టపాకాయలు ధ్వంసమై పోయాయి. అమరా చెంచయ్య అనే టపాకాయల హోల్‌సేల్ వ్యాపారిది ఆ గోడౌన్. ఆయన పెద్దకుమారుడు దేవుడి పటంముందు వెలిగించిన కర్పూరం జారి టపాకాయల మీద పడడంతో







చిన్నబజారులో పేలిపోయిన టపాసాల గోడౌన్; అందులో కాలి మసి బొగ్గయిన శ్రీనివాసులు (14).

నిముషాల్లో పేలుళ్లు సంభవించాయని పోలీసులు అంటున్నారు. చెంచయ్య మాత్రం కరెంట్ షార్ట్ సర్క్యూట్ వల్ల ప్రమాదం జరిగిందంటున్నారు. ఎట్లాఅయితేనేం. చిన్నబజారంతా పేలుళ్లతో దద్దరిల్లిపోయింది. ఆ ప్రాంతమంతా దట్టంగా పొగ కమ్మేసి టౌన్ అంతా తగలబడి పోతున్నదా అనిపించేసింది. సంతపేట, మూలపేట, పెద్దబజారు, కలెక్టరాఫీసు వీధి, దారకాసుదాకా ఎక్కడిజనం అక్కడ ఇళ్లలో దూరుకొన్నారు; ఏమి జరుగుతుందోనని ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకున్నారు. ఏదో పెద్ద ప్రమాదం జరిగి వుంటుందని అందరూ భయపడి పోయారు. నిజానికి పెద్ద ప్రమాదమే జరిగివుండేది. సకాలంలో ఫైరింజన్లు వచ్చి మంటలార్పబట్టి కానీ, లేకపోతే చిన్న బజారు స్వరూపమే మారిపోయి వుండేది. అప్పటికే చాలా నష్టం కలిగింది. గోడౌన్ వున్న మూడంతస్తుల భవనం బీటలు వారింది. దాని ప్రక్కనే వున్న స్టీల అంగడి, రెడిమేడ్ గుడ్డల షాపు దెబ్బతిన్నాయి. అక్కడే ఆగివున్న ఒక స్కూటర్, సైకిల్ దగ్ధమై పోయాయి. చనిపోయిన శ్రీనివాసులు షాపు యజమాని చెంచయ్య రెండో కుమారుడట. మంటల్ని ఆర్పబోయి ప్రాణాలు కోల్పోయాడు. ఒక గుమాస్తా కూడా మంటల్లో చిక్కుకున్నారు గానీ, ఎట్లాగో తప్పించుకుని బయట పడ్డారు.

గోడౌన్‌కు లైసెన్సు వున్నట్టులేదు. టపాసులు అంగడికి లైసెన్సు తీసుకొని, దానితో గోడౌన్లలో లక్షలు ఖరీదు చేసే టపాసుల్ని విల్వచేస్తుంటారు. ఇదొక్కటే కాదు, స్టోన్‌హౌస్ పేట, సంతపేట ప్రాంతాల్లో ఇటువంటి గోడౌన్లు లెక్కకు మించినన్ని వున్నాయి. దీపావళి ఇంకా ఐదారు నెలలు వుందనగానే వీళ్లు తమిళనాడు నుంచి టపాకాయలు తెచ్చి స్టాకు చేస్తారట. బజార్లలో, జనసమ్మర్థం వున్నచోట ఈ గోడౌన్లకు లైసెన్సులివ్వకూడదు. లైసెన్సులు లేకుండానే దొంగతనంగా స్టాకు చేస్తున్నా, అధికారులు ఎందుకు స హిస్తున్నారో తెలిసిన ఏడుపే కదా!

### విలేకరికి బెయిల్ ఇవ్వలేదు

'టాడా' క్రింద పోలీసులు అరెస్టు చేసిన 'ఆంధ్రభూమి' విడవలూరు విలేకరి వి. చిట్టిబాబుకు జిల్లా కోర్టు బెయిల్ నిరాకరించింది. పీపుల్స్ వార్ గ్రూప్‌కు చెందిన తెల్ల అనిల్‌కుమార్, దొంతిరెడ్డి కమల సింగ్‌లకు కూడా బెయిల్ యివ్వలేదు. ఉగ్రవాద సాహిత్య గ్రంథాలు దొరికాయన్న కారణంతో పోలీసులు వీరిని మే 16వ తేది కావలిపాళెంలో అరెస్టు చేశారు. నిందితుల్లో ఒకరు విలేకరని, మిగతా ఇద్దరూ విద్యార్థులని, వారికి సొంత ఆస్తి పాస్తులున్నాయని వారి తరఫున న్యాయవాది వాదించారు. అయినా వారికి బెయిల్ ఇవ్వడం సాధ్యంకాదంటూ జిల్లా జడ్జి శ్రీ ఇస్మాయిల్ 1తేది తీర్పుచెప్పారు.

### కోర్టు భవనాల మార్పు

కనకమహల్ వద్ద గురుదేవి బిల్డింగ్స్‌లో వున్న నాలుగు కోర్టుల్ని 1తేది నుండి ఆర్టీసి బస్టాండ్ వద్ద వున్న ఏనుగు సుందరరామిరెడ్డి ట్రస్ట్ భవనాల్లోకి తరలించారు. జిల్లా కోర్టు ప్రాంగణంలో పురాతన భవనాలను పడగొట్టడంతో ప్రిన్సిపల్ డిస్ట్రిక్ మున్సిఫ్ కోర్టు, ఫస్ట్ పిడిఎం కోర్టు, మూడో అదనపు మున్సిఫ్ మేజిస్ట్రేట్ కోర్టుల్ని సంవత్సరం కిందట గురుదేవి బిల్డింగ్స్‌కు మార్చారు. కానీ అక్కడ గదులు ఇరుకుగావడంతో లాయర్లకు, కక్షిదార్లకు ఇబ్బందిగా వుండేది. దాంతో ఏనుగు సుందరామిరెడ్డి బిల్డింగ్స్‌కు మార్చారు.

పిల్లి పిల్లల్ని మార్చినట్లు న్యాయస్థానాలను ఇల్లిల్లూ తిప్పడమేనా, సొంత భవనాలు త్వరగా సమకూర్చుకోవడం ఏమైనా వుందా?

### ఇదేం పొగ

టౌన్‌లో రిట్రేడింగ్ ఫ్యాక్టరీలు ఎక్కువ కావడంతో కాలుష్యం విపరీతమవుతూంది. సుబేదారుపేటలో వీధివీధినా రిట్రేడింగ్ ఫ్యాక్టరీలు తయారయ్యాయి. ఎటు చూసినా పొగ! జనం ఉక్కిరిబిక్కిరవుతున్నారు. పగలే రాత్రి అనిలేదు. ఎప్పుడూ పొగలు కక్కుతూనే వుంటాయి. దైనా దంత వైద్యనిపుణుడు డాక్టర్ పిటర్‌సె, ఇంకొందరు సుబేదారు పేటవాసులు కలిసి జిల్లా కలెక్టరుకు ఫిర్యాదు చేశారు. కలెక్టరు వెంటనే ఆ ప్రాంతంలోని రిట్రేడింగ్ ఫ్యాక్టరీలను మూయించ వలసిందిగా మునిసిపాలిటీని ఆదేశించారు. ఐనా ఏంలాభం? నెల కావస్తున్నా అంతదాకా మునిసిపల్ అధికారులు పట్టించుకోలేదు. ఎందుకు పట్టించుకోలేదో ఏ 'మహత్తు' వారిని చి చేస్తుందో మనం వూహించుకోవచ్చు. ఐనా కలెక్టరు ఉత్తరువుకే అతీగతి లేకపోతే ఇక ఈ టౌన్ బాగుపడుతుందా?

సుబేదారుపేట ప్రాంతం లోనేకాదు, టౌన్‌లో ఎక్కడ బట్టినా తామరతంపరగా ఫ్యాక్టరీలు పుట్టుకొచ్చాయి. బస్సులు, లారీలు, కార్లు వదిలేపొగ చాల్లేదా అని ఫ్యాక్టరీలు వంపే మందులపొగల వారి పంట పండుతోంది; జనజీవితం దుర్భరమైపోతోంది. జనం ఆరోగ్యాలు కోల్పోతున్నారు. నర్సింగ్ హోమ్‌లు, క్లినిక్కులు పెరుగుతున్నాయి.

### రీకోకు కొత్త ఎండి

అల్లూరు గ్రామీణ విద్యుత్ సహకార సంస్థ (రీకో) మేనేజింగ్ డైరెక్టరుగా డి. వెంకటరత్నం నాయుడు

కొరవ 6 పేజీలో



సుబేదారుపేటలో వాతావరణాన్ని కాలుష్యపరుస్తున్న రైస్ రిఫైనింగ్ ఫ్యాక్టరీల పొగ

## జనవాణి

(3 పేజీ తరువాయి)

### ఎన్టీఆర్ అసలు రంగిది!

ఎంగిలి చెత్తో కాకిని విసరదని ప్రసిద్ధి చెందిన తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు ఎన్టీ రామారావు మూడు లక్షల అరవై వేల రూపాయలు హెలికాప్టర్ అద్దెను ప్రభుత్వానికి చెల్లించడం విని ఆశ్చర్యపోయాను. తీరా చూస్తే అది పార్టీకి వచ్చిన సభ్యత్వ రుసుంలోని మొత్తమని తెలిసింది. పార్టీ అధ్యక్షుడు అయినంత మాత్రాన పార్టీ సభ్యుల సొమ్మును ఏ ఒక్కరికి చెప్పకుండా స్వంత అవసరాలకు వాడుకొనే 'కక్కుర్తి' బుద్ధి రామారావుదని ప్రజలు గ్రహించాలి. కోట్ల రూపాయల స్వంత ఆస్తి, పాస్తులున్నా వాటినుండి ఒక్క పైసా కూడా తీసి ఖర్చు పెట్టడు. సినిమా పరిశ్రమలో వున్నప్పుడు ట్రస్టులు, ఎక్కడికైనా ప్రారంభానికి విచ్చేసినపుడు కత్తెరలు తీసుకెళ్లే బాపతు ఎన్టీఆర్‌ది. అదేమంటే తరచూ దుష్టకాంగి అని కాంగ్రెస్‌ను తిట్టడం చూస్తే 'గురివింద గింజ' సామెత గుర్తొస్తోంది.

నెల్లూరు. -పందిళ్లపల్లి అరుణమ్మ

### రిజర్వేషన్లు రద్దు చేయాలి

కులవ్యవస్థ పోవాలి. మత వ్యవస్థ నశించాలని వేదికలెక్కి ఉపన్యసించే నాయకులు ఇటీవల కులాల పోరాటాలను ఎక్కువ చేస్తున్నారు. స్వాతంత్ర్యం వచ్చాక హరిజనులు, గిరిజనులు, వెనుకబడి వున్నారని వారి సముద్ధరణకు రిజర్వేషన్లు కల్పించారు. ప్రస్తుతం రోజుకో కులాన్ని రిజర్వేషన్ల జాబితాలో చేర్చుకుంటూ పోతున్నారు. ఈ రోజే పత్రికలలో చూశాను. - కర్నాటక ప్రభుత్వం ఇంకా ముందంజ వేసి 80 శాతం చేసే ప్రయత్నంలో వుంది. దీనిని బట్టి చూస్తే స్వాతంత్ర్యం వచ్చాక పేదరికం, వెనుక బడిన తనం ఎక్కువై పోయినట్లుంది. ప్రతి ఒక్క కులాన్ని వెనుకబడిన కులాల్లో చేర్చే బదులు ఒక సంవత్సరం పాటు రిజర్వేషన్లన్నీ రద్దుచేసి, కులాలను అధ్యయనం చేసి ఆర్థిక ప్రాతిపదికన రిజర్వేషన్లు ప్రవేశ పెడితే బాగుంటుంది. మరి ఈ పని చేయను ప్రభుత్వం ఎందుకు వెనుకడుగు వేస్తున్నదో అర్థం కావడం లేదు.

నెల్లూరు. -వాస్తురామచంద్ర

### ఫోరం ఛైర్మన్‌ను నియమించండి!

జిల్లా వినియోగ దారుల ఫోరం గత రెండు నెలలుగా మూత బడిపోయింది. ఛైర్మన్ లేక పోవడమే అసలు సమస్యట. ప్రభుత్వం నియమించిన తాత్కాలిక ఛైర్మన్ ఒక్కరోజు కూడా సీటులో కూర్చొని కేసులు పరిష్కారం చేయలేక పోయారు. వేలాది కేసులు అప్పటికే పేరుకుపోయి వున్నాయి. కొత్త కేసుల దాఖలుకు దిక్కు, మొక్కు లేదు. ప్రజల ఇబ్బంది గ్రహించి వెంటనే ఫుల్ టైమ్ ఛైర్మన్‌ను నియమిస్తే కేసుల పరిష్కారం సత్వరం అయ్యేందుకు దోహద పడుతుంది.

వెంకటగిరి. -కె.ప్రభాకరరావు

### కావలి బ్యాంకులో చెల్లని నోట్లు!

ఇటీవల కాలంలో కావలి లోని బ్యాంకులలో ఖాతాదార [illegible] ఇస్తున్న సైకంలోని నోట్లు ఎక్కువగా చిరిగి పోయినవి, చినిగిపోయి వుంటున్నాయి. ఇలాంటి నోట్లను మార్చడం కష్టమై పోతున్నది. రిజర్వుబ్యాంక్ ఆదేశ సూత్రాల అనుసారం ఇది జరుగుతున్నట్లు చెప్పుకుంటున్నారు. బ్యాంకి మేనేజర్లు తాజాగా వుండే నోట్లకు ఇండెంట్ చేసి ప్రజలను చెల్లని నోట్లబాధలనుండి తప్పించాలని మనవి.

కావలి. -సుజాతనాగరాజరావు

### కానిస్టేబిల్‌ను నియమించండి

టౌన్‌లో ఇటీవల అభివృద్ధి చెందిన ప్రాంతాలలో రామలింగా పురం ఒకటి. ఈ ప్రాంతంలో ట్రాఫిక్ రద్దీ విపరీతంగా పెరిగిపోయింది. కాని ట్రాఫిక్‌ను కంట్రోల్ చేయను ఒక్క కానిస్టేబిల్‌ను కూడా ట్రాఫిక్ పోలీసులు ఏర్పాటు చేయలేదు. హరనాథ పురం లోనికి వెళ్ళేందుకు దాటవలసిన సర్వేపల్లి కాలువ బ్రిడ్జిపైన చిల్ల వ్యాపారులు తిష్టవేసి కూర్చోవడం వల్ల ట్రాఫిక్‌ను తప్పించుకొనేందుకు పాదచారులకు ఇబ్బందికరమైన వుంది.

ఇటీవలే ఆత్మకూరు బస్టాండ్ జేమ్సుగార్డన్ నుండి మళ్లిస్తున్న భారీ వాహనాలన్నీ ఈ సెంటర్ గుండానే వెళుతూ ట్రాఫిక్‌ను చిందర వందర చేస్తున్నాయి. అందువల్ల తక్షణం కంట్రోలుకు కానిస్టేబిల్‌ను నియమించాలి.

నెల్లూరు. -డి. అంజనమ్మ

### కోటి విద్యలు ఓట్లకొరకే!

కాపులపై కానుకల వర్షం కురిపించిన ప్రభుత్వ ధోరణిని ప్రశంసిస్తూ 'జనవాణి' శీర్షికలో ఆవుల కొండయ్య గారి వుత్తరం చదివాక ఇది రాయాలని పించింది.

వర్షానికి తడచి నష్టపోయి నందుకు ఉప్పోడు ఏడ్చాడట. పప్పోడూ యేడ్చాడట; తమలపాకుల వాడు మరీ బొర్లి బొర్లియేడ్చాడట. కొండయ్య గారు కాపుల కిచ్చిన వసతులవల్ల ఏ నష్టము కలగదని ప్రభుత్వం చెబుతున్నట్లు వివరించారు. ఈ ప్రత్యేక ఏర్పాట్ల వల్ల కొండయ్య గారు లాభ పడతారు కాబట్టి ఈ మాట అని వుండవచ్చు. కొల్లవారు కాపుల కిచ్చిన వసతులకయ్యే ఖర్చులు ఆయన స్వంత ఖజానా నుండితీయడంలేదు. అంతా ప్రజల సొత్తే. కాపులకంటే ఆర్థికంగా వెనుకబడిన వారు ఎందరులేరు. ఉభయ గోదావరి జిల్లాలోగల కాపులు ఎంత పేదలో అందరికి తెలుసు. ముద్రగడ పద్మనాభం కులప్రాతిపదికన కాకుండా ఆర్థిక ప్రాతిపదికన వుద్యమం చేపట్టివుంటే బాగుండేది. కోటి విద్యలు కోటి కోసం [illegible] పిల్ల కోతి ధోరణి వల్ల మూకబలం కలహాలదే రాజ్యమవుతుంది.

బింగునీరారు. -పెనుబల్లి శంకరయ్య

### వివేక హుకుం కొందరికేనా?

నెలకు 6 వేల నుండి 8 వేల వరకు జీతాలు తీసుకొనే లెక్చరర్లు కాలేజీలో క్లాసులు తీసుకోకుండా, కోచింగ్ సెంటర్లలకు పరిమితమైతే ఇకనుండి పూరుకోనేది లేదని వి.ఆర్.కాలేజీ సెక్రటరీ వివేకానంద రెడ్డి హుకుం జారీ చేసినట్లు తెలిసింది. ఇది నిజంగా, విద్యార్థులు వారి తల్లిదండ్రులు హర్షించే విషయమే. కాని ఈ నోటీసులు కొందరు లెక్చరర్లలకు మాత్రమే జారీ చేశారని ఆ నోటా ఈ నోటా వినిపిస్తోంది. ఇది సహించరాని విషయం. కాలేజీ విషయాల్లో కీలక పాత్ర నిర్వహించే ఒక వ్యక్తి సృష్టే దీనికి కారణమని తెలుస్తుంది. ఇటీవల కాలేజీలో ర్యాంకులు సాధించిన విద్యార్థులు వారి ప్రతిభ ఆధారంగా సాధించారే గాని అధ్యాపకులకు చేరిన అయ్యవార్ల బోధన వల్ల కాదు. కష్టమైన, నష్టమైన ఖచ్చితమైన నిర్ణయాలు లెక్చరర్‌లను కోచింగ్ సెంటర్లకు పోకుండా చేస్తాయి గాని 'తూతూ మంత్రపు' నిర్ణయాలు పరిస్థితిని మార్చలేవు.

-టి. రఘుపతి రెడ్డి

నెల్లూరు వి. సీతారామయ్య

### ప్రతిభకు విలువ లేకుండా పోయింది!

బిసి, ఎస్.సి. ఎస్.టిల విషయంలో మన ప్రభుత్వాలు ఆస్తులు లేదా ఆదాయాలను బట్టి రిజర్వేషన్లు అమలు చేయకుండా కేవలం కులాల వారీగా ఎందుకు చేస్తున్నారో అర్థం కావడం లేదు. ఎఫ్‌సిలలో అందరూ ధనవంతులేనా, పేదవారు లేరా? బిసి. ఎస్.సి. ఎస్.టిలలో అందరూ పేదవారేనా, ధనవంతులు లేరా? ఈ కులాల్లో కూడా రాజకీయాలను శాసిస్తున్న నాయకులు, అన్ని స్థాయిలలో ప్రభుత్వోద్యోగులు ఎందరో వున్నారు. కులాల ప్రాతిపదికన కాకుండా పలువురు మేధావులు సూచిస్తున్న ఆర్థిక ప్రాతిపదికన రిజర్వేషన్ల విషయం పై ప్రభుత్వం ఎందుకు మొగ్గు చూపడం లేదో అర్థం కావడం లేదు. రిజర్వేషన్ల ముందు ప్రతిభ రాను రాను అడుగంటి పోయేటట్లుంది.

నెల్లూరు -యిన్నమూరి శ్వేత

### తస్లీమా నవల్లో తప్పులు లేవు!

తస్లీమా నస్రీన్ వ్రాసిన 'లజ్జ' నవల చదవ కుండా విమర్శలు చేయడం చాలా పొరపాటు. ఆమె వ్రాసిన నవలను విశాల భావంతో చదివిన వారెవరైనా ఆమె వ్రాసింది వాస్తవమన్న అభిప్రాయానికి వస్తారు. నేను ఈ మధ్య కలకత్తా నగరానికి పోయినపుడు ఆ నవల ప్రతిని కొని చదవడం జరిగింది. దానిలో వక్రీకరణ గాని [illegible] గాని లేవు. ఢాకాలో ఇటీవల బ్రహ్మాండమైన మహిళా ప్రదర్శన జరిగింది. [illegible] ప్రపంచంలో నడిచే దేశంలో అందరు మహిళలు గడప దాటి బయటకు వచ్చారంటే, దాని వెనుక వున్న కారణాన్ని అందరూ గ్రహించాలి. నిదానంగానైనా నస్రీన్‌కు ప్రపంచ వ్యాప్తంగా మద్దతు లభిస్తుంది. ప్రస్తుతం మత ఛాందసులకు భయపడి ఎందరో లోలోపల నస్రీన్‌ను అభినందిస్తున్నా బయట పడి వెల్లడించ లేకున్నారన్నది వాస్తవం.

-షేక్ అహమ్మద్ భాషా

నెల్లూరు.

## జిల్లావార్తలు

( ఏడవ పేజీ తరువాయి )

సీతారాంపురం, వరికుంట పాడు, దుత్తలూరు, చేజర్ల, వింజమూరు, కలువాయి మండలాలకు చెందిన వాది, ప్రతివాదులు సాక్షులతో సహా ఆ రోజు కోర్టులో హాజరు కావచ్చు. కార్యక్రమంలో జిల్లా జడ్జి ఇస్మాయిల్ అడిషనల్ జిల్లా జడ్జి సూర్య నారాయణ, లోక్ అదాలత్ కన్వీనర్ కె. రంగనాథ్ పాల్గొంటారు.

### స్కాలర్ షిప్పులకు దరఖాస్తు చేయండి!

ప్రభుత్వంచే గుర్తింపు బడిన కళాశాలలో మెట్రిక్, ఎస్.ఎస్.సి. అనంతరం కోర్సులు చదువుతున్న వెనుక బడిన తరగతులకు చెందిన విద్యార్థిని, విద్యార్థులకు ఉపకార వేతనం మంజూరు చేయ నున్నారు. సెప్టెంబర్ 30 తేది లోగా పూర్తి చేసిన దరఖాస్తులను కళాశాలల ద్వారా జిల్లా సాంఘిక సంక్షేమ శాఖ పంపు కోవాలని కోరుతున్నారు.

## నెల్లూరు ముచ్చట్లు

( ఐదవ పేజీ తరువాయి )

ఛార్జి తీసుకున్నారు. పాత ఎండి ఆర్. సుబ్రహ్మణ్యాం నెల్లూరుకు బదిలీ అయ్యారు.

### రొయ్యకు గుర్తింపు

ఇన్నాళ్లకు ప్రభుత్వం జిల్లాలో రొయ్యల సాగును పరిశ్రమగా గుర్తించింది. కలెక్టరు శ్రీ ఎం. సాంబశివరావు ఒక ప్రకటనలో ఈ విషయం తెలియజేస్తూ, జిల్లాలో రొయ్యల పెంపకం చేపట్టేవారు ముందుగా కాలుష్య నివారణను గురించి ఇండస్ట్రీస్ ప్రమోషన్ కమిటీ నుండి అనుమతి పొందాలని తెలియజేశారు. మంచిదే, కానీ ఇటువంటి అనుమతి అన్ని పరిశ్రమలకు వాహనాలకు అక్కర్లేదా?

## పంచాంగం

తే 12 శుక్రవారం గరుడపంచమి వ్రతం

### మూహూర్తములు

తే 11 బేస్తవారం ఉ.గం.9.20లకు కన్యాలగ్నమున ఉపనయన, వివాహ, గృహారంభ వ్యాపార ప్రారంభములకు సుముహూర్తము.

### ఆగస్ట్ తిథులు

తే6 శనిచతుర్దశి ప.గం.2.18 వ

తే7 ఆది అమావాస్య ప.గం.2.8వ

శ్రావణ శుద్ధ

తే 8 సోమ పాడ్యమి ప.గం. 1.40వ

తే9 మంగళ విదియ ప. .12.18 వ

తే10 బుధ తదియ ప.గం .10.45 వ

తే11 గురు చతుర్థి ఉ.గం 9.15 వ

తే12 శుక్ర పంచమి ప.గం. 6.45 వ

పొట్టేంపాటి లక్ష్మీనివాసులు ఎం.ఏ.

ఎక్స్‌సిపాయి.

## నెల్లూరు సంగతులు

(4 పేజీ తరువాయి

కేంద్ర సహకార బ్యాంక్ అధ్యక్షుడు వేమారెడ్డి రామచంద్రా రెడ్డి ఈ నెల 10 తేది విమాన మెక్కనున్నారు. యూరప్, అమెరికా, ఎమెన్ దేశాలు చుట్టి వచ్చి అక్కడి విషయాలు చెప్పే మందు [illegible] పదవి స్వీకరించాక బ్యాంక్ సాధించిన అభివృద్ధిని 29 తేది పత్రికల వాళ్లకు తాపీగా వివరించారు. ఇతర వాణిజ్య బ్యాంకుల కన్నా వివిధ రకాల డిపాజిట్ల పై అర శాతం వడ్డీ అధికంగా చెల్లిస్తున్నట్లు చెబుతూ, జిల్లాలోని రైతులకు ఈ ఏడాది ఖరీఫ్ పంట కాలానికి మరో ఐదు కోట్ల రూపాయల రుణాలు మంజూరు చేస్తామన్నారు. ఖరీఫ్ సీజన్‌కు పది కోట్ల రుణాలు ఇవ్వాలని లక్ష్యంగా నిర్ణయించి, జూలై నెలాఖరుకు 9.94 కోట్ల మంజూరు చేసామని, మరో ఐదు కోట్లు వెంటనే మంజూరు చేస్తామన్నారు. దీర్ఘ కాలిక రుణాలు 113 లక్షలు పంపిణీ లక్ష్యం కాగా ఇప్పటి వరకు 60 లక్షలు మంజూరు చేసారట. రుణాల వసూలు కూడా బ్రహ్మాండంగా వుందట. గతంలో ఎన్నడూ లేని విధంగా 60 శాతానికి చేరుకొన్నట్లు చెప్పారాయన. ఈసారి నాయుడు పేట ఎం.పి. షుగర్స్ ఫ్యాక్టరీ పరిధిలోకి రైతులకు 1.20 కోట్లు, కోవూరు షుగర్ ఫ్యాక్టరీ 8 కోట్లు, నెల్లూరు పాల డైరీకి 3 కోట్ల రుణాలుగా అందజేశారట. డి.సి.సి.బి.లో అవుట్ స్టాండింగ్ రుణాలు వంద కోట్ల చేరాలన్నది తన ధ్యేయమని తన మదిలో మాట వెల్లడించారు ఛైర్మన్. అయితే బ్యాంకు రుణాలు తీసుకొని కొంత మంది వుద్దేశ్య పూర్వకంగా బకాయిలు చెల్లించడం లేదని అటు వారి పై చట్ట పరంగా కఠిన చర్యలు ఇక తప్పవన్నారు. అటువంటి బాపతు సభ్యులు 6,246 మంది కాగా రావల్సిన అప్పులు 5,51 కోట్లని బాధ పడ్డారాయన. అందువల్ల సెప్టెంబర్ వరకు చూసి అప్పులు చెల్లించని వారి పేర్లను పేపర్లప్రకటిస్తామన్నారు. లో జిల్లాలో దినదిన ప్రవర్ధమాన మవుతున్న రొయ్యల పెంపకానికి ఈ యేడాది 41.91 లక్షలు రుణంగా అంద జేసినట్లు చెప్పి ముగించారు.

### స్పీడు వాహనాలకు సిగ్నల్ బ్రేకులు!

నెల్లూరు టౌన్ రోడ్ల పై వాహనాలు రౌతులు లేని గుర్రాలే! వీటికి కళ్లాలు వేయను సిటీ నుంచి ట్రాఫిక్‌కు వచ్చిన కొత్త సిఐ రాజ్ కుమార్ సంకల్పించాడు. గత వారం పది రోజులుగా నడి రోడ్‌లో ఎండలో నిలబడి వి.ఆర్. కాలేజి, కనక మహల్, ఆత్మకూరు బస్టాండ్‌ల వద్ద మళ్లీ ట్రాఫిక్ సిగ్నల్స్ ఏర్పాటు చేయించాడు. డి.ఎస్.పి. లక్ష్మీ రెడ్డి చొరవ చేసి రాఘవ గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్ ద్వారా ఇప్పించిన డివైడర్లు వెంకట రమణా హోటల్ నుండి వి.ఆర్.సి. వరకు పెట్టారు. వీటన్నింటిని ట్రాఫిక్ పోలీసులు 29 తేది రూట్ మార్చ్‌చేస్తూ ఇఫ్‌కో ఛైర్మన్ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి, పివి ప్రసన్న రెడ్డి, ఎస్.పి. రమణ మూర్తి చేత లాంఛనంగా ప్రారంభింప చేశారు.

ఈ సందర్భంగా ట్రాఫిక్ పోలీసులు ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ఆశ్చర్య పోయే విషయం ఒకటి ఎస్.పి. రమణ మూర్తి చెప్పారు. అదే మంటే నెల్లూరు జిల్లాలో ఏటా వంద హత్యలు జరిగితే దానికి సరి సమానంగా రోడ్డు ప్రమాదాల్లో వంద మంది మరణిస్తున్నారు. దీన్ని అరి కట్టేందుకు మరో 15 రోజుల్లో ట్రాఫిక్ అడ్వైజరీ కమిటీ నియమిస్తానని దీని వల్ల ప్రజల సలహాలతో ట్రాఫిక్ మరింత మెరుగవు తుందన్నారు. రాఘవ గ్రూఫ్ ఆఫ్ ఇండస్ట్రీస్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ పి.వి. ప్రసన్న రెడ్డి మాట్లాడుతూ ప్రమాదం జరిగిన స్థలం నుండి బాధితులను ఆసుపత్రికి తరలించేందుకు మొబైల్ అంబులెన్స్‌ను మాగుంట రాఘవ రెడ్డి ఛారిటబుల్ ట్రస్ట్ తరఫున ఏర్పాటు చేస్తామని హర్షధ్వానాల మధ్య ప్రకటించారు. అంబులెన్స్‌కు అవసరమైన డ్రైవర్, డాక్టర్, నర్సును వెంటనే ఏర్పాటు చేస్తా మన్నారు. ప్రజల సహకరిస్తేనే ట్రాఫిక్ సమస్య పరిష్కార మవుతుందని, పెరిగి పోయిన జనాభా ఈ సమస్యకు కారణమని ఇఫ్‌కో ఛైర్మన్ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి అన్నారు. కార్యక్రమంలో ఆచార్య పిస రెడ్డి, ట్రాఫిక్ ఎస్ఐలు, పలువురు లారీ ఓనర్లు, ఆటో కార్మికులు కూడా పాల్గొన్నారు.

### సంఘ సేవకు మరో సంఘం

కుల, మత రాజకీయాలకు అతీతంగా యువతను సమైక్య పరచి, వారిలో వ్యక్తిత్వ వికాసాన్ని వృద్ధి చేసేందుకు టౌన్‌లో యునైటెడ్ యూత్ ఆర్గనైజేషన్ సంస్థ ఏర్పడింది. 31 తేది స్టోన్‌హౌస్ పేటలోని మంగుమూరు వారి వీధి మునిసిపల్ అప్పర్ ప్రైమరీ స్కూల్‌లో జరిగిన సంస్థ సమావేశానికి వంద మందికి పైగా యువకులు హాజరయ్యారట. టౌన్ జార్జ్ రోటరీ క్లబ్ అధ్యక్షులు పి. శ్రీనివాసులు నూతన పాల[illegible] కార్యవర్గ సభ్యుల చేత ప్రమాణ [illegible] చేయించారు. సంస్థ పాలక మండలిలో కె. రామ మోహన రెడ్డి అధ్యక్షులుగా, కె. మహేంద్ర రెడ్డి ఉపాధ్యక్షులుగా, కె. శ్యామ్ ప్రసాద్ రెడ్డి కార్యదర్శిగా, కె. ఉమా మహేష్‌గా సంయుక్త కార్యదర్శిగా పి. రాంబాబు కోశాధికారిగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు.

## గ్రంథసమీక్ష

( నాల్గవ పేజీ తరువాయి )

ఒక ఉన్మత్త సైనికుడే!''-నంటూ బల్ల గుద్ది చెబుతాడు.

'కవిత్వాన్ని' అచ్చు వేయడమనే సాహసానికి ఒడిగట్టిన శ్రీనాగేంద్ర తనకు భారంకాని విధంగా మొత్తం కవితల్ని 30 పేజీలలో కుదించి చక్కని మార్గ దర్శకత్వాన్ని చాటాడు కవి లోకానికి.

ఏటూరి నాగేంద్రకి ఇది రెండవ కవితా సంపుటి. మొదటి 'రేపటి గీతం' ప్రచురించాడు.

బిందు సుబ్రహ్మణ్యం అన్నట్లు ''ఏటూరి నాగేంద్రరావులబ్ధ ప్రతిష్ఠుడు కాక పోవచ్చు అయితేనేం తన శైలిలో, ఆలోచనా విధానంలో సమాజాన్ని చైతన్య వంతం చేయడానికి ప్రయత్నిస్తున్నాడనడం నిజమే ననిపిస్తుంది. కవితల్లో పిచ్చరపిడుగులాంటి అతని భావావేశాన్ని చూస్తుంటే-

భవిష్యత్ కవితల్లో శ్రీనాగేంద్ర అస్పష్ట, సంక్లిష్టతలను, స్టేట్ మెంట్లను పరిహరించి భావాన్ని నిర్ద్వంద్వంగా కవిత్వీకరించడానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

-పాయసం సుబ్రహ్మణ్యం

## ఢిల్లీకి పంపింది

( రెండవ పేజీ తరువాయి )

ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టడం, సంజాయిషీ యిచ్చుకోలేనంతటి చిక్కుల్లో ఇరకించడం ప్రతిపక్షాలకు తగిన వ్యూహమే! కానీ అందుకు పార్లమెంట్‌ను స్తంభింప చేయడం, దేశంలో మరో సమస్య లేనట్టు దానికే పూర్తి సమయాన్ని వినియోగింప జేయడం ఏం సబబు? ప్రజలు పార్లమెంట్‌కు ఎన్నుకున్నది తమను పరిపాలించ డానికి, తమ జీవన పరిస్థితులు మరుగు పడేట్టు దేశాన్ని రూపొందించడానికి అనే విషయాన్ని, ప్రతినిధులు పట్టించు కోకుండా, కేవలం కుంభకోణాలతోనే కాలక్షేపం చేయడం తగునా? స్కాంలో ప్రభుత్వం చేసిన నేరాలు ప్రజల దృష్టికి వచ్చే విధంగా పార్లమెంట్‌లో చర్చలను నిర్వహించాలే కానీ, సమావేశాలనే స్తంభింప జేయడం వల్ల ప్రయోజనం వుందా? దీని వల్ల అసలు సమస్య పక్కదారి పట్టి పోవడం లేదా? ఈ వైఖరి వల్ల ప్రతిపక్షాలు ఆశించిన దానికి భిన్నమైన [illegible]తాలు రావడం లేదా? బలహీన ప్రభుత్వాన్ని ఏ ఆటయినా ఆడించ[illegible]వ్వుల పాలు చేయవచ్చు. అదైనా శ్రుతిమించితే గతి తప్పుతుంది. కానీ నిలదొక్కుకోగలిగిన బలం వున్న ప్రభుత్వాన్ని ఏమీ చేయలేమని తెలిసీ పాత ధోరణినే అనుసరించడం ఏం వ్యూహం?

'స్కామ్' మన వ్యవస్థకే ఒక మాయని మచ్చ. ఐతే అది ఒక్కసారిగా ఆకాశాన్ని వూడి, పివి ప్రభుత్వం మీద పడిందికాదు. ఆర్థిక వ్యవస్థలో ఏళ్లపూళ్లుగా జరుగుతున్న అక్రమాలను అవకతవకలను అరికట్టలేక పోవడం, లేదా చూసీ చూడనట్టు, తెలిసీ తెలియనట్టు వుండిపోవడం ఈ పరిస్థితికి దారి తీసింది. తిలా పాపం తలా కొంచెం అన్నట్లు దీని బాధ్యతను అందరూ పంచుకోవాలి. ఇప్పుడు అన్యాయం అక్రమం అని గొంతు చించుకుంటున్న ప్రతిపక్షనేతలు కూడా అధికారంలో వున్నప్పుడు ఈ కుంభకోణం నిరాటంకంగా కొనసాగిందనే విషయాన్ని మరచి పోకూడదు. అందుకే ప్రజల ముందు అందరూ దోషులే! కాని దోషాన్నిఒకరిమీదనే రుద్ది, దాని నుంచి తాము లాభపడాలని ప్రతిపక్షాలు ఆశిస్తే కుదరదు. పార్లమెంట్‌ను స్తంభింప జేయడం ఏమంత కష్టంకాదు. కానీ అందుకు ప్రజలకు సంజాయిషీ చెప్పుకోవలసి వస్తే, అప్పుడెదురవుతుంది కష్టం!

ప్రజా ప్రతినిధులే, చట్ట సభల్లోనే ధర్నాలకు, ఘెరాయింపులకు పాల్పడితే ఇక ఈ దేశం గతేమిటి?.

## శివారెడ్డి పద్యాలు

### బాపూజీ

ఇండియాకు గొప్ప ఇలవేల్పు బాపూజీ!
పుట్టుకుంటె కాలు మెట్టుకుంటె
ఇందిపెంది[illegible] ఇకలేదు, ఇకరాదు
చేయిజారి పోత వేసెదేంది.

### కాంగిరేసు

'కాంగిరేసు' పార్టీ కలగూర గంపైంది
ఎత్తుబడి పొయ్యింది ఎర్రజెండా
ఎక్కడుందో తెలుగు ఏమూల దాగుందో
కానరావడంలె, కళ్లుపోలు

### కులమతాలు

ఎంతకాలమైందొ ఏవారు పుట్టామో
కులమతాలు ఊటికొంపదియ్య
పెరిగిపెద్దదయ్యి పెరతాయి ఇండియాకు
ముప్పుతెచ్చి, కొంప ముంచుతాయి!

## నీటి మట్టం

కనిగిరి రిజర్వాయరు 11.9అ.
సర్వేపల్లి రిజర్వాయరు 6.1అ.
నెల్లూరు చెరువు 11.8అ.

# మూస చిత్రాలు 'రొంబా మోసం'

దాదాపు 25కోట్ల రూపాయలు మూలధనంగా 35 చిత్రాలు విడుదలయ్యాయి. అభిమాన సంఘాలు తప్ప ప్రేక్షకులు స్పందించలేని ఒకే మూసలో తయారైనట్లున్న భారీ చిత్రాలు ఘోరంగా పరాజయం చెందాయి. విడుదలైన 30 డబ్బింగ్ చిత్రాల వల్లకాస్తో కూస్తో గిట్టుబాటు అయిందని తెలింది. శాటిలైట్ టి.వి., కేబుల్‌టి.వి., దూరదర్శన్‌ల మూలంగా సినిమాలు చూడడానికి థియేటర్లకు వెళ్ళేందుకు ప్రేక్షకులలో బద్ధకం చోటు చేసుకున్నది. ద్వితీయార్థంలో విడుదలయ్యే చిత్రాలు ఏ విధంగా వుంటాయో-వాటివిజయం మీదే తెలుగు సినిమా రంగం భవిష్యత్తు ఆధారపడి వుంది.

## భయంకర స్మగ్లర్ వీరప్పన్

ఎ.ఎం.రత్నం చిత్రంలో నటించే సుకన్య తమిళంలో బిజీ స్టార్- 'వీణ' ఎస్.బాలచందర్ మనుమ రాలు. షూటింగ్‌లో కాస్త గ్యాప్ దొరికితే చాలు-ఈమె ఎన్నో ఆసక్తికరమైన విషయాలు చెప్తుంటుంది. ఇటీవల ఈమె ఒక తమిళ చిత్రం ఔట్ డోర్ షూటింగ్‌కు హోసూరు దగ్గరున్న మహేశ్వరన్ కొండల ప్రాంతానికి వెళ్ళిందట. ఆ ప్రాంతంలో భయంకర స్మగ్లర్ వీరప్పన్ దాక్కుని వున్నాడని వర్తమానం అంది పోలీసులు అక్కడంతా గాలిస్తున్నారట. ఆశ్రయమివ్వమని ఆ గ్రామవాసులకు అప్పగించ బడిన వీరప్పన్ వదినను సుకన్య చూసిందట. తన అభిమాన హీరో రజనీకాంత్ లొంగి పొమ్మని ఒక్క మాట చెప్తేచాలు - వీరప్పన్ వెంటనే లొంగిపోతాడట. ఈ విషయం గురించి అక్కడి ప్రత్యేక పోలీసు బృందం ఆలోచిస్తోందట. "షూటింగ్ చూడడానికి వీరప్పన్ వస్తాడేమో అనుకున్నారు. ఆ ఛాయలకు రాలేదు," అంది సుకన్య నవ్వుతూ

## "గ్యాంగ్‌మాస్టర్" ద్వంద్వార్థాలు

"మా సినిమాలనైతే భూతద్దంతో చూస్తారు. సెన్సార్ బోర్డులో ప్రముఖ హోదా వహించే తిక్కవరపు సుబ్బరామిరెడ్డిగారి 'గ్యాంగ్ మాస్టర్' చిత్రంలో డబుల్ మీనింగ్ డైలాగ్‌లను మాత్రం ఎలా ఓ.కె. చేశారో? -అని కొందరు నిర్మాతల ప్రశ్న. అందులో కొన్ని సంభాషణలు:

రాజశేఖర్‌తో వాణీ విశ్వనాథ్: "నేను బులెట్‌ని అయినా దాఖుంతేది-ఎంచక్కా నీ బాడీలో దూరి ఉండేదాన్ని"

బ్రహ్మానందంతో ఒక మహిళ: "తొందరగా ఎక్కించండి. తట్టుకోలేక ఛస్తున్నాం"

బాబూమోహన్‌తో మరదలు: "దోరు తెరిచింది ఎక్కడానికి కాదు; దిగడానికి"

జిమ్‌లో ఒక మహిళ: "అందరూ ఒక్కసారే 'నాది రాసుకోండి నాది రాసుకోండి అంటే ఎలా? ఒకరి తర్వాత ఒకరిది రాసుకుంటాను.

ఒక వనితతో మరొక వనిత: "మూడో కాలు ఎక్కడున్నా అది అవసరం అయినప్పుడే బయటకు కనబడుతుంది"

మాటల్లోనే కాక పాటల్లోని కొన్ని చరణాల్లో కూడా కొంత అశ్లీలం ధ్వనిస్తోందని ఆ నిర్మాతల వాదన!

## మళ్ళీ జ్యోతిలక్ష్మి

వెంకటేశ్ ద్విపాత్రాభినయంతో ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో ఎ. వెంకట్రామరెడ్డి "అంఖే" హిందీ చిత్రం ఆధారంగా నిర్మిస్తున్న చిత్రంలో చాలా కాలం తర్వాత జ్యోతిలక్ష్మి నటిస్తోంది. "నేను సినిమాలకు ఫుల్‌స్టాప్ పెట్టి చాలా కాలమైంది. మా అమ్మాయిని హీరోయిన్ చేయాలని ఏ కంపెనీకి తీసుకెళ్లినా ఆ అమ్మాయి సంగతి మాట్లాడక 'మీరెందుకు మళ్లీ సినిమాలలో నటించరాదూ?' అని నన్నే అడుగుతున్నారందరూ. అందుకే ఈ చిత్రం ఒప్పుకున్నా. మరి కొన్ని చిత్రాలలో నటిస్తానో లేదో ఇప్పుడిప్పుడే చెప్పలేను అన్నది జ్యోతిలక్ష్మి.

## అక్కినేని నాయికల మహోత్సవం

ఎ.ఎన్.ఆర్ 70ఏళ్ల నిజ జీవితం, 60ఏళ్ల నటజీవితం, 50ఏళ్ల సినీ జీవితం పురస్కరించుకుని ఆ మహా నటునితో 250 చిత్రాలలో నటించిన 60మంది తారలతో దాదాపు 50మంది విశాఖ పట్టణం పోర్ట్ 'గోల్డన్ జూబ్లీ' స్టేడియంలో సెప్టెంబర్ 4న ఘనంగా సత్కరిస్తారు. ఈ మహోత్సవం నిమిత్తం ఏర్పాటైన ఒక ప్రత్యేక కమిటీకి ఛైర్మన్ అయిన తిక్కవరపు సుబ్బరామిరెడ్డే ఆ నాటి మహోత్సవానికి కూడా అధ్యక్షత వహిస్తారు.

## చందమామ-విజయాకంబైన్స్ హాస్య ప్రధాన చిత్రం

"భైరవద్వీపం" నూర్రోజులు దాటి ప్రద ర్శింప బడి కర్నాటక లోనూ, తమిళనాడులో కూడా సూపర్ హిట్ కాని, హెవీ ఫుల్‌టాక్స్ మూలంగా నిర్మాతల చేతికింకా డబ్బురాలేదు. ఈ నిర్మాతలు తమిళంలో కమలహాసన్, గౌతమిలతో "నమ్మవర్" ప్రారంభించారు. మరి, తెలుగులోనూ తీయాలి కదా? కాని మద్రాసులో నిర్మించిన చిత్రాలను మన రాష్ట్రంలో ప్రదర్శించ కూడదని ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎగ్జిబిటర్స్ కౌన్సిల్ ఒక నిర్ణయం తీసుకోనున్నదని తెలిసి దక్షిణ భారత ఫిలిం ఎంప్లాయీస్ ఫెడరేషన్ అధ్యక్ష, కార్యదర్శులు తీవ్రంగా ఖండించారు. ఇది అనాలోచితమైన ప్రకటన. మన రాష్ట్రంలో తయారయ్యే చిత్రాలు పొరుగురాష్ట్రాలలో ప్రదర్శింప కూడదు. ఇలాగే ఆ రాష్ట్రాలవారు కూడా నిర్ణయిస్తే, ఏమౌతుంది? స్వార్థ బుద్ధితోనో, దురుద్దేశ్యంతోనో తీసుకునే ఇటువంటి నిర్ణయాలను కాలరాయక పోతే తెలుగు చలన చిత్ర పరిశ్రమ మనుగడకే ముప్పు.

ఏది ఎలా ఉన్నా చందమామ విజయా కంబైన్స్ వారు ఒక హాస్య ప్రధాన చిత్రాన్ని నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు. హీరో రాజేంద్ర ప్రసాద్. రచన, దర్శకత్వం: జంధ్యాల;

## అశ్వని తండ్రిగా నటిస్తున్న దర్శకుడు

పరుగుల రాణి అశ్వని నాచప్ప తన తొలి చిత్రం నుండి ఇప్పటి వరకు మౌళి దర్శకత్వం లోనే నటిస్తుంది. అశ్వనితో 'ఇన్స్‌పెక్టర్ అశ్వని' అందరూ అందరే చిత్రాలను తీసిన త్రిపురనేని ప్రసాద్ ముచ్చటగా మూడో చిత్రాన్ని ఆమెతోనే తీస్తున్నారు. ఈ చిత్రానికి దర్శకత్వం వహించడంతో పాటు అశ్విని తండ్రిగా ప్రత్యేక పాత్రలో మౌళి కనిపిస్తారు. ఇప్పటికి పెళ్లి నిశ్చయమై పోయివున్న అశ్వని ఈ చిత్రం తరువాత బహుశ వెండితెరపై కన్పడే సూచనలు లేవు.





"నాన్నగారు" చిత్రంలో సంజయ్, దివ్యవాణి

# బోరెత్తిన బోయ్‌ఫ్రెండ్

'ప్రేమ' పేరువెబితే ప్రపంచంలో పులకించని హృదయముండదు. అందులోనూ 'కాలేజి టీనేజర్స్'లో ఈనాడు 'లవ్' కంపల్సరీ అయిపోయింది. వాటిలో ఎన్ని ప్రేమ జంటలు పెళ్లి వరకు పోతా యన్నది ప్రశ్న కాకపోయినా, యంగ్ బాయ్‌కి 'ప్రేయసి' యంగ్ గర్ల్‌కి 'ప్రియుడు' చాలా వరకు నేడు 'స్టేటస్ సింబల్'. కష్టాల కడలిలో జీవిత నౌక సాగేందుకు ప్రేమను త్యాగం చేసి మనసును చంపుకొని తదనంతరపు జీవితాన్ని సాగించే సర్దుకుపోయే ప్రేమికులు; మనసు చంపుకోలేక ప్రాణాలు తీసుకొనే రాజీపడని ప్రేమికులు కోకొల్లలు. ప్రేమను ఎన్నో కోణాల నుండి చూపిన అద్భుత చిత్ర రాజాలు తెలుగుతెరపై వెలుగులు చిమ్మాయి. మామూలుగా ఈ రోజుల్లో 'లవ్‌స్టోరీ' వస్తుందంటే దానిపై హై ఎక్స్‌పెక్టేషన్స్‌తో యువత ఎదురు చూస్తుంటారు. అటువంటి చిత్రం వారిని స్పందింప జేసేట్లు లేక పోయేసరికి 'ఫ్లాప్' టాక్ వచ్చేస్తుంది.

కె.ఎస్.రామారావు తీసిన 'బోయ్‌ఫ్రెండ్' చిత్రంలో 'హార్ట్‌ను టచ్' చేసే సన్నివేశాలు కొన్ని చోటు చేసుకొన్నా, విరామం తరువాత విసుగును పెంచేవి ఎక్కువై పోయాయి. ముఖ్యంగా తీవ్రవాదం నేపథ్యంగా సాగతీసిన కథ, చిత్ర సారాన్ని దిగమింగేసి నిర్వీర్యం చేసింది. 'బోయ్‌ఫ్రెండ్' లో ప్రేమికులు పాలిట విలన్స్ వుగ్రవాదులు. సిద్ధాంతాల, రాద్ధాంతాలు పక్కన పెట్టి దోపిడీ దొంగల్లా ప్రేమికుల వెంట పడడం వారి స్థాయిని దిగజార్చింది. వుగ్రవాద వుద్యమం ఒరలిపోతున్నదంటూ 'ఎంతమంది ప్రాణాలు తీస్తారు, ఎంత రక్తం చిందించి సిద్ధాంతమని

* అల్లూరు రహీం

సరిపెడతారన్న మాట ఆలోచింప జేస్తుంది. దర్శకుడు హాస్యం కోసం జర్నలిస్ట్ పాత్రలను వాడుకోవడం ఏమంత బాగోలేదు. తుపాకి గుండు తగిలిన హీరో అప్పటికప్పుడే కులాసాగా పాటలు పాడుకొనే సన్ని వేశం ఈ కోవలోనిదే. వెండితెరపై వయ్యారాలు ఒలక బోస్తూ, సయ్యాటలు సాగిస్తూ, యువత హృదయాల్లో ప్రేమ తెమ్మెరలు రేపే 'పూజాభట్' ఒక్కటే 'బోయ్‌ఫ్రెండ్' కు చివరకు ప్రధాన ఆకర్షణ అయ్యింది.

10 పేజీ కొరవ

## నెల్లూరు డాక్టరు ప్రతిభ

వింత శిశువు - ఇన్‌సెట్‌లో డాక్టర్ సి. మోహన రెడ్డి

మద్రాసులో డాక్టరుగా ప్రసిద్ధిచెందిన నెల్లూరీయుడు డాక్టర్ సి.మోహన్‌రెడ్డి అరుదైన కాన్పుచేసి వైద్యచికిత్సలో రికార్డు నెలకొల్పారు. 22 తదీన విల్లివాకంలోని ఆయన నర్సింగ్ హోంకు శాంత అనే నిండు చూలాలు కాన్పుకొచ్చింది. కష్టమైన కాన్పు. ఏ మాత్రం అజాగ్రత్తగా వున్నా తల్లి ప్రాణానికే ప్రమాదం ఏర్పడేది. కానీ మోహన్‌రెడ్డి చాలా నేర్పుగా ఓర్పుగా తల్లి గర్భంలోంచి బిడ్డను బయటకు తీశారు. బిడ్డంటే బిడ్డా! రెండు తలలు, మూడుకాళ్లు, మూడు చేతులతో ఐదున్నర కేజీల బరువుతో భయంకరంగా పుట్టింది. పుట్టిన కొద్ది నిముషాలకే చనిపోయింది. మరో రెండు గంటలు ముందు వచ్చివుంటే ఆపరేషన్‌తో బిడ్డను బయటకు తీసి బతికించి వుండవచ్చని మోహన్‌రెడ్డి అన్నారు. అటువంటి బిడ్డ బతకడం కంటే పోవడమే మేలనుకోండి. ఐనా మోహన్‌రెడ్డి ప్రతిభకు అదొక చిహ్నం. అంత బరువైన శిశువును ఏ ఆపరేషన్ లేకుండా కాన్పు చేయడమే అరుదు. అందుకు మోహన్‌రెడ్డి అభినందనీయుడు.

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

ఇక కథలోకి వెళితే కోటీశ్వరుని ఏకైక గారాల పట్టి పూజ (పూజభట్) తెగింపు గల ఆడపిల్ల. కాలేజీలో ఆమె ప్రవేశము అద్భుత ఆకర్షణ అవుతుంది. సీనియర్స్‌నే రాగింగ్ చేసి, కాలేజీలో మగవాళ్లందరికీ లవ్ లెటర్స్ వ్రాసి సంచలనం సృష్టిస్తుంది. ధైర్యంగా ఒక యువకుడికి ముద్దిస్తుంది. ఒక పందెంలో ఓడిపోయి 'దిగంబర దేవకన్య' వస్తానని 'బెట్' కాసి తన అందాలనుపుష్పాలు, పత్రాల చాటున దాచి 'వనకన్య'లా ప్రత్యక్షమై మతులు పోగొడుతుంది. పూజ కోరుకు కళ్లాలు వేయును ఆమె క్లాస్ మేట్ మదన్ (సాయికృష్ణ) రంగంలోకి దిగినా, మన్మథ బాణాలు వంటి శక్తిగల ఆమెచూపులకు దాసుడవుతాడు. చిలకా గోరింకల్లా కు..కు.... లాడుకోవడానికి వెళ్లిన 'ప్రేమజంట' పాలిట ఆరోజు దుర్దినం అవుతుంది. రాష్ట్ర నాయకుడు (జెవి సోమయాజులు) లను చంపాలను కొని వుగ్రవాద బృందం నాయకుడు(శ్రీహరి) పంపిన బంటును ప్రేమజంట చూస్తారు. అతని నుండి తప్పించుకునే ప్రయత్నంలో నాయకునిహత్యాయత్నం ప్రేమికులపై మోప బడుతుంది. పోలీసులూ- వుగ్రవాదుల నడుమ పడరాని పాట్లు పడిన ప్రేమ జంటను మాజీ వుగ్రవాది క్రాంతి కుమార్ (నాజర్) రక్షించి, వారు నిర్దోషులని చాటి చెప్పి ప్రాణాలు విడుస్తాడు.

చిత్రం ప్రథమార్థంలో కాలేజి నేపథ్యంలో సాగే కథ సినిమా చూస్తుంటే వారిని హుషారెక్కిస్తుంది. విరామం తరువాత మరో రెండు రీళ్లకు చిత్ర కథ ముగిసి పోయినా, దర్శకుడు రీళ్లకోసం సాగతీసే నిర్ణయం తీసుకొని నిర్మాత చేతులు కాల్చాడు. జివి అమరేశ్వరరావు వ్రాసిన కథ తనికెళ్లభరణి సంభాషణలు సరిపోలేదు. హాలు నుండి బయటకు వచ్చేటప్పుడు గుర్తుండే ఒక లవ్ కొటేషన్ కూడా లేకుండా పోయింది. కాలేజికి పూజాభట్ తొలిసారిగా వచ్చే సన్నివేశం, ·వనదేవతలా ప్రత్యక్షమవడం, ప్రేమికుల గాఢ చుంబనం, పోరూంలో హంగామా, ప్రతి విషయానికి ఆశ్చర్యపోయే స్టూడెంట్ మేనరిజం చిత్రంలో యువతను ఆకట్టుకొనే సన్నివేశాలు, మిగతావి వాళ్లను నీరసపరచాయనే చెప్పవచ్చు. 'ప్యారా హుషార్' 'నీ అందం హంపి ఎల్లోరా' 'నింగికినేలకు నిచ్చెనలు' వేసుకొని చరణాలలో సాగే గీతాలు విన సొంపుగా వున్నాయి. ఈ పాటలు తీసేందుకు ఎంచుకొన్న ప్రదేశాలు అశోక్ కుమార్ కెమెరాలో మరింత అందంగా కనిపించాయి. ఈ చిత్రానికి సంగీత దర్శకుడు ఎంఎం కీరవాణి అయినా ఎందువల్లో నేపథ్య సంగీతాన్ని మాత్రం ఎస్‌పి వెంకటేష్ కూర్చాడు. నటీ వర్గంలో తెలుగు తెరకు తొలిసారిగా పరిచయం చేసిన దర్శకుడు మహేష్ భట్ తనయ పూజాభట్ ముద్దుగా, బొద్దుగా ప్రేయసి పాత్రకు సరిపోయింది. ఆమె చేత ధరింప చేసిన కాస్ట్యూమ్ అందంగా అమరాయి. ప్రేమికుని పాత్రలో నూతన నటుడు సాయికృష్ణ నటన పరంగా కష్టబడ్డా గ్లామర్ హీరోయిన్ ముందు వెలవెల బోయాడు. ఉగ్రవాద నాయకుని పాత్రలో యువ నటుడు శ్రీహరి రాణించాడు. తతిమ్మానటుల్లో నాజర్, దేవదాస్ కనకాల, మురళీ మోహన్, తనికెళ్ల భరణిలు తమపాత్రల్లో రాణించేందుకు పోర్షన్లు కరువైనాయి పాపం! ఛాలెంజింగ్ రేసులో ప్రతి సెకనూ విలువైనదన్నట్లూ, ప్రేమ చిత్రాల్లో ప్రతి ఫ్రేమూ అందంగా అమరితేనే ప్రేక్షకులను ఆకర్షిస్తుంది. ఆ పని చేయడంలో స్క్రీన్‌ప్లే వ్రాసుకొని దర్శకత్వం నెరపిన భరత్ కృతకృత్యుడు కాలేక పోయాడు.

## ఏకాకి

( మొదటి పేజీ కొరవ )

ఎస్టేట్ కాద'' ని సమాధాన మిచ్చేదాకా పోయిందంటే వ్యవహారం ఎంతగా బెడిసి పోయింది అర్థమవుతుంది. అంతటితో కూడా ఆగలేదు. ద్రోణంరాజు, వి. హనుమంత రావు, కణితి విశ్వనాథం ఏకంగా ప్రధాని పి.వి.నే కలుసుకొని తక్షణమే ముఖ్య మంత్రిని మార్చకుంటే ఎన్నికల్లో కాంగ్రెస్ సుద్ధంగా తుడిచి పెట్టుక పోతుందని హెచ్చరించడం కూడా జరిగింది.

అక్కడితో కూడా పూర్తి కాలేదు. ఢిల్లీలో రాష్ట్రానికి చెందిన పార్లమెంట్ సభ్యులు సమావేశమై ఈ సారి అసెంబ్లీ ఎన్నికల టికెట్ల పంపకంలో తమను కూడా సంప్రదించాలని తీర్మానించే దాకా పోయారు. అంటే అంతా ఏక పక్షంగా జరగటాన్ని మరో వైపు నుంచి కూడా నిరోధించే ప్రయత్నం ప్రారంభ మైందను కోవాలి. అసెంబ్లీ ఎన్నికలను సంబంధించి టికెట్ల వగైరా వ్యవహారాల్లో తమకు తగిన ప్రాతినిధ్యం లభించేట్లు చూడ్డానికి మంత్రి వెంకట స్వామి, కొణతల రామకృష్ణ, జి. చొక్కా రావు, ఎం. బాగా రెడ్డి, ఆర్.కె. ధావన్‌తో ఒక కమిటీ ఏర్పడింది. ముఖ్య మంత్రి ధోరణిని, వ్యవహార సరళిని పార్లమెంట్ సభ్యులు ఎంతగా వ్యతిరేకిస్తున్నారో ఈ పరిణామం సూచిస్తున్నది.

ఈ పరిణామాన్ని కాంగ్రెస్ అధిష్టాన వర్గం చూసీ చూడనట్లు వుండలేదు. రాష్ట్రంలో వర్గాలైతే సరేకానీ, పార్లమెంట్ సభ్యులే కమిటీగా ఏర్పడి అభ్యర్థుల ఎంపికలో తమకూ ప్రాధాన్యం యివ్వాలని కోరితే అధిష్టాన వర్గం కాదని ఎట్లా అనగలుగుతుంది? ఎం.పి.లు నడుం కట్టి రాష్ట్ర రాజకీయాల్లో ఇంత చొరవ తీసుకోవడమే కాకుండా, ఎన్నికల్లో వాటా కావాలని ఇది వరకెప్పుడూ కోరలేదు. రాష్ట్ర నాయకత్వంతో సరిపడని ఎం.పి.లు వుండవచ్చు కానీ, వారందరూ ఐక్యమై ముఖ్యమంత్రి మీద ధ్వజ మెత్తడం, అభ్యర్థుల ఎంపికలో తమను కూడా సంప్రదించాలని పట్టుబట్టడం రాష్ట్ర రాజకీయాల్లో పెద్దామలుపే!

ఉత్తరాంధ్ర పర్యటనతో ముఖ్యమంత్రి ఒక వర్గాన్ని దూరం చేసుకున్నారు. ఐతే మరో వర్గం దగ్గర కొచ్చింది. ద్రోణంరాజు వర్గం ముఖ్య మంత్రితో తెగ తెంపులు చేసుకొన్నట్లైతే జిల్లాలో ద్రోణంరాజును వ్యతిరేకించే గుడివాడ గురనాధరావు వర్గం ముఖ్యమంత్రి పర్యటన బాధ్యతను మోసింది కానీ, అంత మాత్రాన్నే దాన్ని ముఖ్యమంత్రి సన్నిహిత వర్గంగా పేర్కొనడం సరికాదు. గురునాధ రావు, సాంబశివరాజు తదితరులు ఎప్పటికైనా జనార్దనరెడ్డిని అనుసరించే వారే కానీ, కోట్ల ఖాతాలో జమ పడరు. ద్రోణంరాజుకు గురునాధ రావుకు మధ్య పచ్చ గడ్డి భగ్గు మంటుంది. ఒకప్పుడు గురు శిష్యులే అయినా, ఇప్పుడు బద్ధ శత్రువు లయ్యారు. గురునాథరావు ప్రాతినిధ్యం వహిస్తున్న పెందుర్తి నియోజక వర్గంలో ఈ సారి తన కుమారుణ్ణి నిలపాలని ద్రోణంరాజు పథకం వేస్తున్నాడు. అది కుదరక పోతే అక్కడ గురునాధ రావును ఓడించే దాకా నిద్ర పోనని ద్రోణం రాజు అంటున్నాడు. ఈ పరిస్థితుల్లో ముఖ్యమంత్రి పర్యటన గురు నాథ రావుకే బాగా ఉపకరిస్తుంది. అవసరం కొద్ది ఆయన ముఖ్యమంత్రికి అనుకూలంగా వుంటాడు. కానీ పరీక్షా సమయం వచ్చినపుడు ఎటు వుంటా డన్నదే ప్రశ్న!

పార్లమెంట్ సభ్యులు రంగంలో దిగి రాష్ట్ర రాజకీయాల్లో ప్రత్యక్షంగా జోక్యం చేసు కోవడంతో ముఖ్య మంత్రి కోట్ల పై ఎత్తుగా పిసిసి పునర్ వ్యవస్థీకరణ కోరుతూ ఢిల్లీకి పరుగు లెత్తడం మొదలు పెట్టాడు. పిసిసిని తన గుప్పెట్లో పెట్టు కొంటే ఎంపీల వ్యతిరేకతను సమర్థ వంతంగా ఎదుర్కొన గలమని ఆయన ఆశ. అది నిజమే కావచ్చు. కానీ పిసిసి ఆయన ఆశించిన విధంగా నెర వేరు తుందని ఎట్లా అనుకోగలం? కోట్ల చెప్పిన వారికే పిసిసి పట్టం కట్టేటట్లయితే ఆ పని ఇది వరకెప్పుడో జరిగి వుండేది. కానీ అది పి.వి.కి. ఇష్టం ఉన్నట్లు లేదు. మరి ఎవర్ని నియమించాలనే విషయంలో ప్రతిష్టంభన ఏర్పడింది. ఎవరి పేరు చెబితే ఏమవు తుందో నన్న సంశయం ముఖ్యమంత్రికి వుంది. ముఖ్య మంత్రి పేరు సూచిస్తే దాని సంగ తేమిటో తేల్చ వచ్చునని పి.వి. అను కొంటున్నట్లుంది. మొత్తానికి పిల్లి మెడలో గంట ఎవరు కట్టాలో తేల లేదు. ఎం.పి. ల తిరుగు బాటుతో ముఖ్య మంత్రికి పిసిసి పునర్ వ్యవస్థీకరణ అవసరం ఎక్కువైంది. ఐతే అంత అవసరం పి.వి.కి. వుందా అన్నది ప్రశ్న. తులసీదాస్ కొన సాగినా పి.వి.కి నష్టమేమీ లేదు. పైగా ఎం.పి.ల తిరుగు బాటు సందర్భంలో ముఖ్య మంత్రిని నిర్ద్వంద్వంబల పరుస్తూ ఆయన చెప్పిన పేరునే పిసిసికి ఖాయం చేస్తారా అన్నది కూడా అనుమానమే!

మొత్తం మీద కోట్ల ముఖ్య మంత్రి అయిన కొత్తల్లో ఎం.పిలు ఏం కోరితే అవి నెరవేరేవి. ఎం.ఎల్.ఎ.లను కూడా పట్టించు కోకుండా ఎం.పిలకే పెద్ద పీట వేస్తుండే వాడు. అట్లాంటిది ఇప్పుడు తారు మారయింది. ఎం.పిలు ఒక్కొక్కరే కోట్లకు దూర మవుతున్నారు. ఇది ఆయన నాయ కత్వానికి మంచి చేయదనే అభిప్రాయం పరిశీలకుల్లో వుంది.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

భారతి చలాకీ మెచ్చుకోతగినది. యితరులుగూడ బాగానే చేసిరి. వీరికి ప్రోత్సాహమిచ్చే యిందుపూరు కోటారెడ్డిగారికి గూడ మా ధన్యవాదాలు.

-విమర్శకుడు.

### కస్తూరిదేవి బాలికా హైస్కూలు

### రేబాలపట్టయ్య సహాయం

శ్రీ రేబాల పట్టాభిరామిరెడ్డి గారు ఎంతయు ప్రశంసనీయులు. వారితోడ్పాటు మాకు లేకపోతే మేమింతలో ఈ ఉన్నత సంస్థ నెలకొల్పలేక పోవుదుమనుట అతిశయోక్తికాదు.





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,